ఓం
శ్రీగురుభ్యోనమః

# నిర్మలానంద తత్వదర్శిని

రచన

నిర్మలానంద
పిల్లలమఱ్ఱి భీమయాఖ్యులు

ప్రచురణ
పరిపూర్ణాచల వేదాంత పరిషత్
జనవరి 1972

# అచల గురు మండలి

శ్రీ గుండా ఈశ్వరయ్య గురు కరుణా నంద శికింద్రాబాద్ (సితాఫల్ మండి ప్ర॥ కార్యదర్శి) శ్రీ జోష్యుల జననీ జగన్నాధరావు (భూమా నంద) పెనుగొండ అచల ఋషి పత్రికా సంపాదకులు శ్రీ కోన సూర్య నారాయణమూర్తి (సదానంద) తాడెపల్లి గూడెం (అవధూతా శ్రమ ప్ర॥ కార్యదర్శి) శ్రీ రామేణ ఆదినారాయణ (పూర్ణానంద) రాజమండ్రి, భూలోక దానకరాది బిరుదాంకితులు. శ్రీ పొన్నాల రాజయ్య (దయానంద) శికిందాబ్రాద్. శ్రీ అరిగె రామస్వామి (పూర్ణానంద) శికింద్రాబాద్.

# చందాదారులు

(ప్రతి పేరుకు మొదట శ్రీయని, చివర గారు అని చదువుకొనగలరు.)

## మాతృశ్రీ భక్తానంద తూడి దేవమాంబగారి శిష్యబృందము

ములుగు

నీల కనుకయ్య
కల్లూరి వెంకటయ్య

బుద్దారము

దేవరకొండ సమ్మయ్య

చాతరాశిపల్లె

మంకు నర్సయ్య

కేశాపురము

చింతల చంద్రమౌళి

పెద్దకోడెపాక

తడుక బుచ్చయ్య

నర్సాపురం

తడుక రామస్వామి
పొట్లేటి నర్సిరెడ్డి
కొంక మల్లయ్య
కొంక వెంకట్రాములు
చిగురు రామస్వామి
జోడు కొమురయ్య
తడుక కొమురయ్య

పాపయ్యపల్లి

మొగిలిచర్ల కొమురయ్య
,, నర్సింహరాములు

మాదాపురము

బం భక్తుల శంకరయ్య
వీరయ్య
రాజలింగం
లింగమూర్తి
ముద్రివేణి రాములు

ప్రేమనగర్

జగ్గాని కనుకయ్య
రామంచి మల్లయ్య
కాశెట్టి కొమురయ్య
చింతమారు నర్సయ్య
కొప్పుల జగన్నాధము
తులా వెంకటనర్సయ్య
రామంచి లక్ష్మీనర్సయ్య
శ్రీమతి మూడ్యంగు కళావతి
శిరికొండ వెంకటాద్రిమినర్సయ్య
చాతరాజు నర్సింహ్మరామయ్య

వాతరాజా కమలాబాయి
చిందం ఎల్లమ్మ
శెట్టి అగయ్య
కుమ్మనేని కనుకవ్వ
బండారు మల్లయ్య
పదాల మదనయ్య

పాలంపేట

పిల్లలమర్రి సమ్మయ్య
భక్తానంద పాన్‌షాప్
బండి కనుకయ్య
వీరాములు
మార్కు ఓదెలు
నరిమెట్టి రాజన్న
బుర్రి వీరస్వామి

రాజాపురం

చింతిరెడ్డి ప్రతాప్‌రెడ్డి
చింతిరెడ్డి రాజిరెడ్డి

అంబాల

డాక్టరు సాంబయ్య

వరంగల్

గజ్జెల ఓదెలు విష్ణులానంద బలభద్రి
పరమేశ్వరాంబగారి శిష్యులు
పీరిసత భవాని
సిరిసిల్ల లక్ష్మక్క
(భక్తానంద శ్రీమ నివాసురాలు)
గుజ్జు రాజేశ్వర్‌రావు
ఒదెపు వెంకటస్వామి
కోడం శంకర్ (శివనగర్)
శ్రీమతి దున్న ఎల్లక్క రంగశాయిపేట

## పూర్ణానంద వాడపల్లి అగయాచార్యులవారి శిష్యవర్గము

బ్రహ్మానంద శ్రీ వేల నాగయాచార్యులు రంగశాయిపేట వరంగల్ సత్యానంద బల సాగరపు బుచ్చయ్య రంగశాయిపేట వరంగల్

## పతత్ గ్రంధాభిమానులు

శ్రీ కే. శ్రీనివాసాచార్యులు B.O.L I year వరంగల్ శ్రీయన్. వెంకటనర్సయ్య కొండపర్తి Dip O L II year శ్రీ వీరమల్ల రాజ నర్సింగరావుగారు పాలంపేట (మాలీపటేలు) శ్రీ ఇమ్మడి కిష్టయ్య షావుకారి పాలంపేట శ్రీ కొండా రాజనర్సయ్య పటేలు పాలంపేట శ్రీ కొండ్ల కేదారి షావుకారి పాలంపేట శ్రీ యం. రమేశ్ పాలంపేట శ్రీ కూనూరు రామస్వామి చిన్నకోడెపాక శ్రీ మోతెము రామస్వామి చిన్నకోడెపాక శ్రీ అబ్బుబాకర్ ఘనపురం శ్రీ తూడి రాంరెడ్డి, శ్రీ తూడి వెంకటరమణా రెడ్డి పాపయ్యపల్లి రాజ్యలక్ష్మి సమేత శ్రీ నల్ల ఉపేందర్ శివనగర్ వరంగల్

# శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయామాఖ్యులవారి శిష్యమండలి

### పాలంపేట

పేరవేని పోశాలు
పెద్దుల గట్టయ్య
కొమ్ము కొమురయ్య
గోరంటల కేశవులు
కొండయ్య శ్రీమతి మల్లమ్మ

### నారాయణపురం

దుద్దుకూరి రాంమూర్తి

### వరదన్నపేట

జి. రామస్వామి
శ్రీమతి ఏకాంతము
సదానందం
ప్రకాష్
శ్రీనివాస్
నిర్మలాదేవి

### బలంతాపూర్

నామాల నర్సయ్య
శ్రీమతి లక్ష్మీనర్సమ్మ
నామాల నారాయణ
శ్రీమతి లక్ష్మీకాంతమ్మ
రామగిరి సాంబయ్య
శ్రీమతి కమలమ్మ
రామగిరి లచ్చమ్మ
కొండి రాజయ్య
వెంకటయ్య
బలభద్రుల కాంతయ్య
లక్ష్మీనర్సయ్య (జిల్లి)

### మైలారాము

గూడెపెల్లి పెదముల్లయ్య
శ్రీమతి ఎల్లమ్మ
,, నర్సయ్య
శ్రీమతి మల్లమ్మ
,, ఉప్పలయ్య
శ్రీమతి అనసూర్య
,, మునికుమార్
శ్రీమతి పద్మావతి

### లోహిత

శ్రీమతి సోమనర్సమ్మ మరియు భర్త
శ్రీమతి రంగమ్మ మరియు భర్త

### జఫర్‌గడ్డ

నల్లతీగెల నర్సయ్య వీరి భార్య
రామనర్సయ్య
శ్రీమతి సోమక్క
యాదమ్మ కాశీబుగ్గ

### కోనాచలము

శ్రీమతి యాకమ్మ వీరి భర్త

### కడిపికొండ

నరిమేటి బుచ్చివీరయ్య
గన్నెపల్లి మొగిలయ్య
బండి వెంకటాద్రిజము
కొండూరు సంజీ రావు

### సల్వాయి

పేరవేని రాజమల్లు

### బండారుపల్లి

చందగిరి నమ్మాలు

శ్రీ శివరామ దీక్షిత అచలగురు సాంప్రదాయకులు

మాతృశ్రీ భక్తానంద శ్రీ తూడి దేవమాంబగారి ప్రియశిష్యులు

శ్లో॥ శ్రీ సద్గురు భక్తానందపాద । కమలామృత ప్రాణభృంగమ్
శ్రీనిర్మలానంద బోధోపదేశికమ్ । భీమయార్య గురుచరణంభజే ॥



శ్లో॥ పిల్లలమఱ్ఱి వంశాంబునిచంద్రం । పూర్ణచంద్ర ప్రదీపికం
సద్విచార ప్రవర్తం చ । భీమయార్య గురుంభజే ॥

## నిర్మలానంద శ్రీ పిల్లలమఱ్ఱి భీమయార్యులుగారు

పాలంపేట — తా॥ ములుగు

# మా మనవి

1971 ఫిబ్రవరి పాపయ్య పల్లెలో జరుగు శ్రీ వాడపల్లి ఆగయార్యుల వారి 14వ వర్ధంతి సందర్భమున ఈ భీమకవి తన కవితా కన్యను నాకు చూపి దీని మా పరిపూర్ణాచల వేదాంత పరిషత్పక్షమున ప్రకటించుమని కోరుటకు సంతోషించితిని నూతనముగా యేర్పడిన ఈ సంస్థకు ఆర్థిక వనరులు తగినంతగా లేనందున కొంత వెనుకాడితిని కాని ఈ గ్రంథమున ప్రకటింపబడిన ధాతల సహకార సానుభూతుల వలన ఈ గ్రంథమును నేటికీ విధముగా ప్రకటించితిమి

కవి ఈ నిర్మలానంద తత్వదర్శిని మా పరిషత్ ద్వితీయ పుష్పముగా ప్రకటించుటకు తీసికొన్న నిర్ణయము ప్రశంసనీయమైనది.

సహృదయులయిన వారు మా యీ పరిషత్ కృషికి ఆర్థిక హార్థిక సహకారములనిచ్చి తోడ్పడుదురుగాక యని మనవి చేయుచున్నాము.

తరువాతి మా పరిషత్ ప్రచురణలు శివరామ దీక్షితీయము వ్యవహారాచలబోధిని పరిపూర్ణాచల వాఙ్మయ చరిత్ర మున్నగునవి

ప్రస్తుత మీ గ్రంథము అచల భక్తులకే మాత్రము ఉపయోగ పడిన మా శ్రమ కొంత ఫలించినదిగా భావింతుము—

ఇట్లు

నల్ల ఉపేందర్ B.O.L I Year

(పరిపూర్ణాచల వేదాంత పరిషత్)

16—4—!50 శివనగర్, వరంగల్—2

ఓం

# అధికార పత్రిక

## శ్రీ మద్బ్రహ్మద్వైశిష్ట సిద్ధాంతము–

శ్రీమత్పరమ గురు శివరామ దీక్షిత అచలపీఠము శ్రీక్రోధి నామ సం॥ చైత్ర బ॥లు గురువారము(1964 రోజున మత్ప్రియ శిష్యుడగు శ్రీ పిల్లలమఱ్ఱి భీమయ్యకు అనుగ్రహ పూర్వకముగా వ్రాసి యిచ్చిన నిర్మలానంద దీక్షాధికార పట్టా–

పిల్లలమఱ్ఱి భీమయ్యకు అచలబోధ తెల్పి కృతార్థునిగా చేసి తద్వత్తుగ ముముక్షువుల మనోఽభిప్రాయమును గనిపెట్టి సూక్ష్మ ప్రజ్ఞగల వారికి గురు వాక్య రీతిగా పరిపూర్ణ సూచన చేసి అచలబోధను తెల్పి భ్రాంతి రహితునిగా చేయునటుల అచల బోధాధికారము యిచ్చి వ్రాసి యిచ్చిన మంగళ శాసనము

ఇందుకు సాక్షులు
తేనెరుకలో లేక తోచిన
1) శ్రీ జి. రాజేశ్వరావుగారు
వరంగల్ టౌన్ ప్లానింగ్ ఆఫీసరు
మాతృమూర్తి శిష్యుడు
2) శ్రీ వేంకట్రామిరెడ్డిగారు
రాజాపురము
మాతృమూర్తి శిష్యుడు

గురుపరంపర సంఖ్య ౨౭

ఇట్లు
మాతృశ్రీ
భద్రానంద తూడి
దేవమాంబ

# అభిప్రాయములు

అచల పరిపూర్ణ బోధోపన్యాస కేసరి, సమరస నిర్మల ప్రజ్ఞాన విలక్షణ అష్టతను నిరసన అచల పరిపూర్ణుడు శ్రీ ఆరుట్ల రామారావు. తొస్సిపూడి తా॥ రాంచంద్రపురము—ది. 3-5-1971

శ్రీ తూడి దేవమాంబగారి శిష్యులు భీమన్న నిర్మలానంద తత్వదర్శినిని నావద్దకు దెచ్చి సవరించుమని కోరినప్పుడు నేను అస్వస్థతగా యుంటి కూడా ఆద్యంతములు వింటిని— ఇందు కవి తన గురు మాత అంతరంగ వర్తన యందు చూపిన ఆర్ద్రిత అతని కవితా వేదనగాన్పించుచున్నది అట్టి పాటలు వ్రాయుటయందు ఆవేశమును ఔచిత్యభరితముగా చూపించినాడు. ఈ కవిత్వం కవి చెప్పినట్లు "ఇహమున సౌఖ్యము నిచ్చును. ఆహమును విడనాడి చదువ అంత్యమునందున్ అహరహిత పదము నిచ్చును" ఇది సహృదయులు చదివి తరించుటకు యోగ్యముగా నున్నది.

కవి నా యందుంచే అభిమానముచేత యింత దూరము వచ్చి నన్ను సంప్రదించి అభిప్రాయము వ్రాయుమని కోరుట సద్గురు శాసనముగా భావించి ఈ కార్యక్రమమునకు కడంగితిని నాకీ అవకాశమిచ్చిన కవికి గురు మూర్తి ఆయురారోగ్య అష్టఐశ్వర్య సంపత్తుల నొసగి. అచల భక్తులకు పీఠ పాఠ ధర్మాలు బోధించ శక్తిని విరివిగా ప్రసాదించుగాక యని ప్రార్థించుచూ యీ నా అభిప్రాయమును ముగించుచున్నాను.

మాతృశ్రీ తూడి దేవమాంబగారి ప్రియశిష్య రత్నము శ్రీమతి నిష్కలానంద బలభద్ర పరమేశ్వరాంబగారు శివనగర్ వరంగల్—2 ది. 17-1-1972.

పిల్లిమట్టి భీమన్న మద్గురు పుత్రుడు చిన్ననాటి నుండి మేము గురు ముఖతా పరిపూర్ణబోధ వినునప్పుడు మిక్కిలి శ్రద్ధాభక్తులుగల్గి ప్రవర్తించువాడు మా యిద్దరి కొకే సమయమున అధికార మిచ్చుటకు నావలె యితడును విముఖతనే ప్రదర్శించెను. కాని గుర్వాదేశము నాకు వలె యీయనకు కూడా దాటనిదే యయ్యెను, "పెత్తనమున వేనుంగిల నెత్తను తినవలసె నీవు చిన్నతనమునసే

పత్తుకొని తినును శర్కర" అన్నట్లు. గురువుగా పొందు సుఖములున్న దుఃఖమే బహాలము— అయినా భీమయ్యగారు నిరుత్సాహపడక "హృదయ గ్రంధిని విడుచుటకయి సదయిత యాబోధ తెల్పజనదా గురుడై" అను సూత్రాను రీతిగా వాడ వాడల పల్లె పల్లెలు తిరిగి గురునామ స్మరణ చేయుచు పొందిన అనుభవమునే ఈ గ్రంధరూపమున ప్రకటించినాడు. "ఉన్నదీ నరకంబున్నదీ. హరిగురోయని యాత్మతోడుత స్మరణచేయుము సోదరుడా" అంటి పాటలద్వార కవిచురుకైన బోధను వెదజల్లెను. సహృదయులు దీనిలో మంచిని స్వీకరించి కవి అభిప్రాయము స్పష్టము చేసికొందురు గాక—

మాతృశ్రీ దేవాంబగారి ప్రియశిష్యరత్న శిరోభూషణులు
అచల పరిపూర్ణులు శ్రీ మేర్గు యాకయ్యగారు వరంగల్–16–1–72

సోదరుడు భీమన్న దయతో పంపించిన గ్రంధమును చదివితిని చాలా బాగుంది. కవిత్వాలకేం కోకొల్లలు కాని కవిత్వాన్ని ఆదరించి పోషించేవారలు లేని ఈ రోజుల్లో యింత పెద్ద గ్రంధము వ్రాసి ప్రకటించిన కవి ప్రశంసనీయుడు. నిర్మలానంద నీతి చంద్రికా భాగములోని పద్యములు సహజమయి మిక్కిలి హితోపదేశకములు యివి కొందరు వ్యక్తులు తమ వ్యక్తిత్వమునకు కూడా పోల్చుకొనుట జరుగుచుండును. అయినా కవి యిట్టివే ఇంకొన్ని వ్రాసి యుంచిన బాగుండునని నేను తలంచెదను యెందుకంటే స్వార్థపరత్వము పెచ్చు పెరిగిపోయిన ఈ రోజుల్లో యెంతో హెచ్చరింప వలసిన బాధ్యత కవులపై యున్నది. ఇదియే భ్రాంతి రహిత పద్యరత్నావళిలోను, యే దుఃఖనివృత్తి సూక్తి ముక్తావళితోను జరుగవని పని— ఇక పాటలు ప్రాసానుగతమైనవి కొన్ని అంత్యప్రాసమయమైనవి కొన్ని మిక్కిలి సుందరముగా గాన్పించుచున్నవి. సినిమాపాటల తీరుల వ్రాయుట ఇంకా సొగసుగా యున్నది, "ఉన్నదీ నరకంబున్నదీ" అను పాట కవికిగల ప్రజ్ఞాపాటవమును ఋజువుపరచుచున్నది.

విజయవాడ వాస్తవ్యులు నిర్మలాంబ శ్రీ తొత్తడి నర్స
మాంబగారి పుత్రిక శ్రీమతి కామందుల లక్ష్మినారాణమ్మగార్లు
(అచల పరిపూర్ణురాలు) విజయవాడ, కొత్తపేట–1— ది. 13–1–72

ఈ నిర్మలానంద తత్వదర్శిని సోదరుడు నల్ల ఉపేందర్ చూపగా చూసితిని. చాలా హృద్యంగముగా యున్నది. కృపజూపగ రావా జననీ"

అని కవి పడిన ఆవేదన తనకు గురువుపైగల భక్తి విశ్వాసము లెట్టివో ప్రకట మగుచున్నది అట్లే "దయరాదా జననీ నాపై దయరాదా జననీ" అని తాను గురుమూర్తి అనుగ్రహమునకు పడుచున్న పాట్లను స్పష్టపరచుచున్నది. 'నమ్మి గాలిచీతెనూ నాశనములేదుగా యెట్టులయిన'' అను పాటలో కవి తాను తన అను భవమును యెంతో ఉత్సాహముగా చెప్పి హామీ యిచ్చుచున్నట్లున్నది. "మానవుడా మరిచూడరా" అను పాటలో కవి భక్తులను చాలా సున్నితముగా మందలించుచున్నాడు. "అమ్మా బ్రహ్మరూపిణి'' అనే పాటములో సద్గురుమూర్తి విశ్వరూపమును చాటుచున్నాడు. యిట్లే కవి తాను పాండిత్య ప్రకర్షలేని వాడనని చెప్పుకున్న అతని లోకానుభవము తన సహజ కవితా పాటవము అతని యశస్సును చాటుచునే యున్నవి. కవి అన్నయ్య యిట్లే ఇంకా అనేక గ్రంథములు ప్రకటించి భక్తజనులకు తోడ్పడునని ఆశించుచున్నాను.

(శ్రీ) తూడి దేవమాంబగారి ప్రియ శిష్య రత్నము (శ్రీ)
గూడూరు చెన్నస్వామిగారు, గోవిందరాజుల గుట్టక్రింద వరంగల్–2
ది. 30–1–72

నా సహోదరుడు భీమకవి దయతో పంపించిన ని.త.ద,ని ఆమూలాగ్రముగా చదివితిని. ఇందలి పాటల సారమును విచారించినచో భా॥కృ॥కం॥ 179 (క్షితిలోన నరుడు ...) అన్నట్లు అజ్ఞాని జగత్తులోని విషయ భోగములను అను భవించి అనుభవించిన విషయముల సారమును గురునివల్ల తెలుసుకున్న వాడైనచో తిరిగి విషయభోగముల భ్రమయందు చిక్కనట్లు (యద్దృశ్యం తన్నశ్యం) అని ఈ పుస్తక విచారణవల్ల తెలియును. ఇందు గురుశుశ్రూషను. అనుష్టాన విధి సాధన చతుష్టయము సామాన్యులకు తెలియనటుల వ్రాసి ఘంటాపద వాక్యములు ఈ పుస్తకమున ఇమిడ్చినందున ఇట్టి గ్రంథము సామాన్యముగా నెంచక తప్పక పై విషయముల యందు శ్రద్ధ చేసినచో అజ్ఞానము తొలగి మానవకోటి సంశయములు తీరి పరిపూర్ణస్థితి నొందుదురని నమ్ముచున్నాను. ముముక్షువులకు నా సహోదరుడగు శ్రీ నిర్మలానందస్వామి అర్పించిన కావ్య కుసుమము. దీనిని... తప్పక ఒకసారి ఈ గ్రంథమును చదువ ప్రార్థించుచున్నాను.

శ్రీ వాడపల్లి ఆగయార్యులవారి శిష్యుడు సాయన్నగారి ప్రియశిష్యరత్న శిరోభూషణుడు సదానంద శ్రీజిల్లా సత్తయ్యాగారు పోస్టు తుర్కలషాపురం వయా మోతుకూరు తా॥ రామన్నపేట జి॥ నల్లగొండ ది. 3-12-71

నిర్మలానంద తత్వదర్శిని ప్రస్తుత అచల సాహిత్యములో అణిముత్యము వంటిది. "ఛందోరీతులుభాషా బందోబస్తైయున నడక భావములేకన్" అని కవి చెప్పుచున్నప్పటికిని కవిత్వము మనోరంజకముగా యున్నది. ముముక్షు జనులు చదివి తరించుటకిది యెక్కుడు తోడ్పడు గ్రంధరాజము.

భక్తానంద మాత శిష్యుడు శ్రీ నల్ల జనార్దన్ ప్రధానకార్యదర్శి పరిపూర్ణాచల వేదాంత పరిషత్ ఇం. నెం. 16-4-1ꠀ0 శివనగర్ వరంగల్-2

శ్రీ భీమన్నగారు ఈ గ్రంధమును మొట్ట మొదటి సారిగా నాకు యింకొందరి మిత్రులకు చూపినప్పుడు అందరు సంతోషించినారు కాని నాకట్టి సంతోషమేర్పడ లేదు కారణం కవి ఆర్థిక స్థితి గతులు నాకు తెలుసు. పోనీ చందాదారుల విషయమా అది అందరికి తెల్సినదే

పూర్వము భోజునివలె భోజనాలు పెట్టువారు కావి రాయలవలె రాజ్యాలిప్పించు వారు కాని లేని యీ రోజుల్లో కవి యింతటి బృహత్తర కార్యక్రమము చేపట్టుట నా విచారణకు హేతువు అయినా గురు కరుణ వలన పొందరాని కోర్కెలు గలవె? ఈ నాటి క్లిష్ట వ్యవ ప్రయాసల కోర్చి ఈ గ్రంధమును ప్రకటించిన సోదరుడు భీమన్న అభినందనీయులు 16-1-72



# కృతజ్ఞతలు

సహృదయులారా

ఈ చరాచర జంగమ స్థావరాత్మక మయిన సువిశాల ప్రపంచములో "దుర్లభం మానుషం దేహం అతి దుర్లభం వివేకం" అను శ్రుతి అనుసారము 84 లక్షల జీవరాసులలో మానవునకే యెక్కుడు ప్రాధాన్య మివ్వబడింది. ఇట్టి ఉత్కృష్ట మయిన మానవ జన్మకు సాఫల్యముగా అధ్యాత్మిక చింతన అత్యం తావశ్యముగా నిర్ణయింప బడింది. అయితే మానవుడు దానిని విస్మరించి చిత్రవిచిత్ర రూపలావణ్యమయిన కోర్కెలకు బానిసయయి రవరవాది నరక జన్మ బాధలకు గురియై అథః పతన మయి యిహపర భ్రష్టుడయి హీనాతి హీనముగా గాన్పించు చున్నాడు.

స్వయం కృతాపరాధుడయిన మానవుడు అష్ట కష్టముల ననుభవించుచూ కూడ దారి తెన్నూ లేని అజ్ఞాన రూపమైన భవ సాగరమున మునిగి తేలుచు అమూల్యమయిన తన సమయమును వృథా పరుచుట విజ్ఞులు చూసి సహించలేరు యెట్లులయినా వీరిని కడ చేర్చ వలయుననే సంకల్పము గల వారలయి వేద శాస్త్ర పురాణ యితిహాసాది రూపమున సాహిత్యమును సృష్టించి దైవ భక్తితోపాటు సంస్కృతీ సభ్యతలను బోధించిరి అయితే అట్టి గ్రంథములు సంస్కృత ప్రాకృతాది భాషా భూయిష్టమయి సామాన్యులకందుబాటులో లేక పోవుట గ్రహించిన కొందరు పెద్దలు వానికి వ్యాఖ్యలు వ్రాయుట జరిగింది భాష్యకారులు తమ తమ అభిప్రాయము కూడా జొప్పించి మూలమునకు కొంత భిన్నించిరి— అట్టివి తరువాత వానికి యదార్థ బోధకముగాక వక్రమైన మార్గ సూచకమయి మరీ హీనమయిన స్థితికి సమాజము జారిపోయిన దానికి కర్తలము మేము గాదని వీరు ముఖావము వహించుట శోచనీయము— ఇట్టి సమన్వయ వాదులు యదార్థబోధోపదేశం చేయలేదని కాదు కాని వీరి సంఖ్య స్వల్పము సమాజము కూడా కూటవృత్తిని వ్యవహరించె వారినె గౌరవించి కనకాభిషేకము చేయుట సత్యవ్రతగుణ గరిష్ఠులను గుర్తించక పోవుట వలన నిజ మయిన ప్రబోధము జరుగక పోయెను. అయినా శివ రామ దీక్షితులు దాదాపు 150 సంవత్సరాల క్రితం సంఘ వ్యవస్థను కనులార గాంచి సముద్ధరింప పరిపూర్ణాచల గుణ సాంద్రులు వీరు భారత భాగవత రామాయణాది గ్రంథములకు సుకమైన

వాఖ్యలు వ్రాసి అభ్యుదయ భావాను కూలముగా నీతి ప్రబోధము చేసిరి. వీరు శివ రామ దీక్షితీయ మను నొక బృహద్గ్రకథనమును వచన పత్రికియలో వ్రాసిరి

ఇది సరళ సుందరమైన శైలిలో వ్రాయబడి ప్రజలకు మనో వికాసమును గలిగించినది. ఆ తరువాత జరిగిన కవిత్వము పాండిత్య ప్రకర్షకులకుమాత్రమే అందు బాటులో యుండినది మొన్న మొన్నటి వరకు తిరిగి సామాన్యశైలితో కవిత్వము చెప్ప వలయుననే ఆలోచనే కవులకు రాకుండెను ఏమైతేనేమి మొత్తము పై భావాన్ని వ్యక్తము చేయుటకు ప్రయత్నించిన ప్రతివాదుతనకు తోచిన ప్రక్రియలో కవితలల్లటము— అదే కవిత్వముగా రూపొందుట సర్వ సాధారణముగా జరిగి పోయిన కాలముయొక్క మార్పు.

ఇట్టి సందర్భమున కొన్ని రచనలతో ఔచిత్య దృష్టి లేక పోవుట వలన కవితాదరణ సన్నగిల్లినది. తత్కారణమున బాగుగా కవిత్వము చెప్ప గల్గు వారు ముందుకు రాకుండ పోవుటకు కారణమైంది—

ఇట్టి స్థితిలో నేనీ గ్రంథ రచనకు పూనుకొని ఏదో కొంతవ్రాసితిని— దీనిని దయతో విని సవరణలు చేసిన శ్రీ అరట్ల రామారావుగారికి హృదయ పూర్వక కృతజ్ఞతలు చెప్పు కొనుచున్నాను. తరువాత ఈ గంధమును చది విన సహృదయులు తమ తమ అభిప్రాయములు వ్రాసి యిచ్చినందుకువారికి ఆత్మిక నమస్కారములు తెల్పుచున్నాను ముఖ్యముగా ఈ గ్రంథమును తమ పరిపూర్ణాచల వేదాంత పరిషత్తు పక్షమున ప్రకటించినందుకు శ్రీ నల్ల ఉపేందర్ వరంగల్ గారికి నేనెంతో ఋణ పడియున్నాను వారికి స్నేహాభి వందనములు ధనసహాయకులకు కృతజ్ఞతలు చేయు చున్నాను.

ఈ గ్రంథమును ధనలక్ష్మి ప్రెస్ వారు సర్వాంగ సుందరముగా ముద్రించి నందుకు నా మనఃపూర్వక అభివందనములు చేయుచు ఈ గ్రంథ మును చదివిన సహృదయులు పంపించిన సలహాలను సగౌరవముగాస్వీకరించి తిరిగి ద్వితీయ ముద్రణలో సవరించు కొందునని మనవి చేయుచు సెలవు తీసి కొనుచున్నాను నమస్తే.

ఇట్లు
పిల్లలమఱ్ఱి భీమయశాస్త్రి
పోష్టు పాలంపేట వయా ఘనపురము
తా॥ ములుగు జి॥ వరంగల్

శ్రీ శివరామ దీక్షిత అచలగురు సాంప్రదాయకులు
శ్రీ భక్తానంద తూడి దేవమాంబగారి ప్రియశిష్యులు



శ్రీ రాయబారం భూదేవీ సమేత వీరన్నగారు
నర్సాపురం తా॥ ములుగు







శ్రీ కూన లచ్చయ్య గారు
నర్సాపురం, తా॥ ములుగు

శ్రీ శివరామ దీక్షిత అచల గురు సాంప్రదాయకులు

శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమయాఖ్యులవారి ప్రియశిష్యులు



శ్రీ కమలాదేవి సమేత రామగిరి సాంబయ్యగారు

బలంతాపురము, తా॥ నర్సంపేట



శ్రీ పేరవేని పోషయ్యగారు

పాలంపేట, తా॥ ములుగు

# నిర్మలానంద తత్త్వదర్శిని

శ్రీరస్తు

శ్రీ పరిపూర్ణాచల పరబ్రహ్మణేనమః

## పీఠిక

బ్రహ్మ విద్య సిద్ధాంతం । భక్తానంద దీక్షితం
మాతృశ్రీ దేవమాంబా । సద్గురుభ్యో నమోనమః

## ఇష్ట దేవతా ప్రార్థనము

కం॥ నిరతము సద్గురు పూజలు
కరమొప్పగ చేసి జనుల కాంక్షలఁదీర్పన్
సరివిల్చె, నట్టి దేవము
గురుఁగొల్వఁగపొందరాని కోర్కులుగలవె ॥ 1

## గురుస్తుతి

తే॥ కర్త జగమున కంతటు కమలభవుడు
భర్త శ్రీహరి భువిలోన భవ్యమూర్తి
హర్త శ్రీహరుడఖిలంబు కాద్యులీరు
నమ్మి గొల్చిన సద్గురు నవనిదలతు ॥ 2

తే॥ సిరులు తానెయై వెలసిన చిన్ని లక్ష్మి
విద్యరూపమై విలసిల్లు విమలవాణి
బలముదై యొప్పు పరమేశు భవ్యరాణి
నమ్మి గొల్చిన సద్గురు నవనిదలతు ॥ 3

తే॥ చావు వలదన్న తపనచే సాగరమును
తరచి అమృతంబు గైకొన్న దైవతముల
గొల్పు ఫలమేమి సాధువుల్ గోరి మదిని
నమ్మి గొల్చిన సద్గురు నవని దలతు ॥ 4

తే॥ మొదలు యచలము నెఱింగించి ముదముతోడ
లేని యెరుకను వివరించి లెస్సయనగ
తుదకు యెరుకును విడిపించు తోయజాక్షన్
నమ్మి గొల్చెద శ్రీగురున్నెమ్మనమున. 5

తే॥ విఘ్న పతియని సృష్టిలో విజ్ఞులా చె
పూజలందుచు గణపతి పూర్వ సుకృత
పుణ్యమున గొల్చు సద్గురున్ బోలుపుమీర
నమ్మి గొలిచెద నాగురున్నెమ్మనమున. 6

—సు క వి ప్ర శం స—

తే॥ మునుపు మార్గపు కవితల మూలమెర్గి
పిదప దేశీయ రచనల భేద మెఱిగి
గ్రంథ రచనల జేసిన కవులకెల్ల
ముందు ముందుగ మ్రొక్కెద మోదమలర. 7

—కుకవి నిరాకృతి—

కం॥ ఆదియు నంతము చదువక
మేదినిలో మందమతులు మేలిమి పద్యతులన్

కాదని దూషణ చేసిన
సాధులు పూజింతురెపుడు సంయములారా.   8

## – కృతి ప్రశంస –

కం॥ పాటలు పద్యంబులు బహు
నీటుగ వచనంబు చేసి, నిర్మల బుద్ధిన్
మేలైన మార్గమిందును
చాటితి మనసైతె గనుడి సంయములారా.   9

కం॥ చదివిన గ్రంథము లన్నిటి
సదమల సారంబుదీసి సద్గురు కృపచే
ముదమున సంగ్రహ పరచితి
సదయులరై గనుడి దీని సంయములారా.   10

కం॥ వేదము ప్రభువలె శాసన
వాదమునన్, దర్శనము ల వరసఖులో లెన్
మోదమును గూర్చు కావ్యము
మేధావులు గనుడ, దీన మిశ్రము లయ్యెన్.   11

కం॥ ఇహమున సౌఖ్యము నిచ్చును
అహమును విడనాడి చదువుదంతము నందున్
అహరహిత పదము నిచ్చును
మహిలో గనుడయ్య దీని మర్మమునంతన్.   12

కం॥ గురువాజ్ఞ పాలనంబున
గురుస్థానము నంది సుజన కోర్కెలదీర్చన్
ధరతిరుగు నన్ను కొందఱు
వరకావ్యము వ్రాయుమంచు వచనము లాడన్.   13

కం॥ ఛందోరీతులు భాషా
బందోబస్తయిన నడకభావము లేకన్
విందైన తత్వ బోధ, ప
సందుగ నిర్మిస్తి భక్తగణ సంతతికై    14

## — కృతిపతి నిర్ణయము —

వ॥ ఇట్టి నా నిర్మించు కావ్యంబున కధినాధుండెవండురా యని విచారించు తరి, మద్గురు పుత్రిక నిష్కలానంద శ్రీమతి బలభద్ర పరమేశ్వరాంబ మాయక్క చేర బిలిచి-

"గురువున కిష్టదైవమునకుం పతికిం
కృతిజెప్పి పుణ్యమున్ వరమును
దేజమున్ బడయవచ్చు జగంబుల నిశ్చయంబు"

యని నిశ్చయంబుగా చెప్పిన విని నిజంబనుచు తలంచి నా గురు మాతృశ్రీ దేవమాంబ పాదపద్మముల కడ—

ఈకృతి నుంచ దలచి ఈ "నిర్మలానంద తత్వ తరంగిణి" కధిముఖంబుగా నా మాతృమూర్తి యవతారము నభివర్ణించెద—

## — కృతిపతి యవతార వర్ణన —

తే॥ రత్నగర్భ యీ భారత రాజ్యమందు
తేజమై యొప్పు బంగారు తెనుగు సీమ
కాకతీయుల గడ్డ యీ కంచుకోట
దివ్యమైనది భువి దాని తీరమందు.    16

తే॥ జమ్మికుంటందు మా తల్లి జననమందె
ఘనులు పత్తేరి వంశాన గౌరమొప్ప
లక్ష్మికిని వీరరెడ్డికి లాలితముగ
పర్వతేశుని సతియందు పార్వతమ్మ.    17

తే॥ తండ్రి శివభక్తి తనలోన దైవభక్తి
గలుగజేయగ బాల్యాన కనులుమూసి
స్మరణ చేయును యేమేమొ సాధువట్లు
అబ్బురా యిది యెందఱి కబ్బు దహహ.                18

తే॥ దేవమాంబని పేరిడి దేశికులకు
ప్రీతి పాత్రురాలగు నంచు పేర్కుతోడ
బ్రాహ్మణోత్తము లనిరి యీ పావనాంగి
రిక్తబోవునా? వారన్నరీతి యయ్యె.                19

తే॥ దినము దినమట్లు గడువగ దిశలు మెరయు
కాంతి పుంజముల్ విరజిమ్ము కంజనేత్రి
పెండ్లి చేసిరి. పెద్దలు ప్రీతితోడ
రమ్యగుణధాము రాఘవరమణుతోడ.                20

తే॥ అదిదంపతు లనగ యీ యవనియందు
గడుపుచున్నారు కాలంబు కలిసి మెలసి
దాన ధర్మాలు భువిలోన తపసులెన్నొ
చేయుచున్నారు సతిపతుల్ చెలిమితోడ.                21

తే॥ చిన్న తనముండె పొందిరి చిరుత నొకతె
అడ్డులే లేవు వారి యానందమునకు
కావి విధి తన వర్తన కఠినమయ్యె
రాఘవుని దేహ మారోగ్య రక్తి తక్కె.                22

తే॥ అందునకు తల్లితో చక దెందమందు
నేమి యీవిధి నన్నిట్లు యేచుచేమి?
యెవరికిని యేమి పాపముల్ యొరిగి సేయ
నైతినని కుందు మటనందు హతవిధంచు.                23

తే॥ పట్టగారాని వ్రతములు పట్టె తల్లి
నోయగారాని నోములు నోచె తల్లి
విన్న వేల్పుల తాకన్న వేల్పులకును
మ్రొక్కులను మ్రొక్కుమీరె మా దిక్కటంచు 24

తే॥ పాలకుర్తిన తనపతి బ్రతుకునంచు
మదిని భావించి పయనమై మార్గమందు
అష్టకష్టాలు పడె తల్లి యంతకంత
భర్త ప్రాణాలె తమ సర్వ భాగ్యమంచు 25

తే॥ ఇల్లు వాకిలి విడనాడి యెన్నొనాళ్ళు
సోమనాథుని సేవించి సోమజలము
దెచ్చి పతికిచ్చు పలుమార్లు తిరిగి తిరిగి
బ్రతుకవలె నంచు పతికయ్యె భ్రమల పడును. 26

తే॥ విన్న మందులు తానిలకన్న మందు
లవనియందున పరులిచ్చు యడవి మందు
లెన్ని పోసిన ఫలితంబు యేమిలేదు
క్షీణదశ కొచ్చె మా తండ్రి క్షితిని తుదకు. 27

తే॥ పుట్టె నటువంటి జీవులు పుడమిలోన
గాసి నొందక యుందునా కన్న తల్లి
భర్త పైనుండు ప్రేమచే బ్రహ్మతత్వ
మెరుగలేదాయె రాఘవుండెల్లి పోయె. 29

తే॥ అంత నా తండ్రి పరలోక మరిగియుండ
స్వర్గమును చెల్లె నాకంచు సాధ్వి మదిని
భర్త కడకేగ తనువెంట పయనమాయె
ఎంత వెఱ్ఱిది మా తల్లి నేమనందు. 29

తే॥ వేదవేత్తలు సుజ్ఞాన వైద్యులంత
దుఃఖరహితంపు పద్ధతి తొలగజేసి
మరణ యత్నము నుండియు మరలసేసి
శాంతి నొందింప జేసిరి సదయులయ్యు. 30

తే॥ దైవ మేతీరు చూచెనో ధైర్యముగను
రామగాధల భారత రమ్యకథల
సహజ కవి పోతనార్యుల సత్కృతులను
జదువుచుండును మాతల్లి సమరసమున. 31

తే॥ తండ్రి యింటిలో కొన్నాళ్ళు తనదు యత్త
వారలింటిలో కొన్నాళ్ళ వాసమంది
గడిపె నా తల్లి కొన్నాళ్ళు గడువ తుదకు
జన్మ మృతులన్న వివరంబు సదువనెంచె 32

తే॥ రామలక్ష్మమ్మ ఆశ్రమ్ము రయముతోడ
జొచ్చి వినుతించె నాగురు చోద్యమంది
దేవమాంబ గుణంబులన్ దెలిసి సర్వ
మర్మ ధర్మాలు తెలిపె నీ మహితలాన. 33

తే॥ ఆరు వత్సరాల్ గడచిన యవల తల్లి
జన్మ రహితంబు పద్ధతి జనని నడిగె
రామలక్ష్మమ్మ యదిగని దద్దిసేసె
తెలియరానిది తానెట్లు తెలియజేయు. 34

తే॥ అంత నా తల్లి యటనుండి యరుగుదెంచి
[illegible]కుడు జనకుని జేరిన సుద్ది యట్లు
యోగయార్యుని చేరియు యవనియందు
నచల పరిపూర్ణ జిజ్ఞాస యయ్యె తల్లి. 35

తే॥ అగయార్యుడు నాగమ నిగమబోధ
లెన్నియో చెప్పి మాతల్లి కున్న భ్రమల
దొలగజేసెను యాగయ్య తోయజాక్షున్
సేవజేయక నరులకు స్థితియు గలదే? 36

తే॥ అట్టి గురుమూర్తి చేతను యచలధర్మ
మెరిగి గురువాజ్ఞ కయిబోధ నిఖిలమందు
చాటనెంచెను, గురుమూర్తి మాటదప్పి
నిల్చు భక్తుల సందురే నిర్మలులని? 37

తే॥ అన్ని విద్యల యందున యారితేరి
చివర వేదాంత విద్యకై పవలురేయి
పరితపించేటి భక్తుడు భవ్యమూర్తి
మల్లికార్జుని కడతేర్చె మహితలాన. 38

తే॥ మాతృ శ్రీయని వేడిన మాన్యురాలు
యవని పరమేశ్వరాంబను యాదరించి
జనన మరణంపు భ్రాంతిని చనగచేసి
దీక్షదక్షల నిచ్చిన దివ్యమాత. 39

తే॥ అంతియెగాదు యోరుగల్ యాశ్రమందు
వచ్చి వినుతించు భక్తుల వాంఛలరసి
ఘోర సంసార బాధల గూలద్రోసి
వెలుగుచున్నారు సద్గురు విమలమాత. 40

తే॥ మంగళంబగు మాతృశ్రీ మహితవల్లి
కెల్ల మంగళ చరితులై యుల్లమందు
మంగళంబంచు పాడుడో మాన్యులార
యెరుకమరువుల పరితాప మెరుగ జెపుడు. 41

కం॥ ఈ సుచరిత్రము చదివిన
యీ సుచరిత్రమును విన్న యిహపర సౌఖ్యం
బాసతొ గల్గును తదుపరి
గాసుకు గొఅగాని యెఱుకగానల కొదుగున్. 42

## — గురు పరంపర వర్ణన —

తే॥ అచలబోధకు పూర్వులు యాదివిష్ణు
దివ్యమైనట్టి సద్గురు దినకరుండు
యా జ్ఞవల్క్యుడు వసుధయనాది ప్రభుడు
జనక మహాఋషి విఖ్యాతి జైగురుండు. 43

తే॥ శుకుడు సాందీప కృష్ణులు సూక్ష్మప్రజ్ఞు
లర్జునులు యుద్ధవులు వీరలాది గురులు
యచల గురుజంఢ బూనిరి హస్తమందు
యుగ యుగంబుల చాటిరి యగణితముగ. 44

తే॥ బ్రహ్మమానందస్వాములు పరగరామ
నందులును జ్ఞానప్రభుడు యమంద హృదయ
సద్గురేశ్వర సమరులు సహజనంద
యవని రామావధూతలు యంబిక శివుల్. 45

తే॥ వేమనార్యుడు పరిపూర్ణ విమలగుణుడు
ధరణి తిరువేంకటాచారి దండి గురుడు
మతము వారలసుడిలోన మనుజులంత
గొట్టుకొనిపోవ, గాచిన కోవిదులుర. 46

తే॥ శ్రీధరులు వీరు మహిలోన చీకుచింత
లేని బోధచే జనులకు లేశమయిన

యెరుకలేదంచు పరిపూర్ణ మెరుకపరచి
శూన్యమున శూన్యమయ్యె యీ సుగుణకరుడు. 47

తే॥ అవని నారాయణా పురమందు వెలసి
ద్వైతబోధ తదితరముల్ తరచిచూచి
దీక్షితీయము వ్రాసిరి దివ్యముగను
యతడె శివరాముడమలుడు యచలగురుడు. 48

తే॥ కంబలూరి వంశంబునం(గాంక్ష మీర
భక్తజనులకు పరిపూర్ణ భావములను
అతుకనేర్పిన సద్గురు డప్పరావు
దశదిశల బోధ నెగజల్లె ధార్మికుండు. 49

తే॥ పావనంబైన యెరగొండ పాలెమందు
నిలిచి భద్రాద్రి రాముడు నిఖిల జనుల
వేలు దొరయని శతకంబు నిచ్చినట్టి
పరశురామ శ్రీ నరసింహ పండితుండు 50

తే॥ పరశు శ్రీ సీతారాముని పరులచేత
పిలువబడి ప్రీతి తోడుత భీతిలేక
యచలబోధను తత్వముగల్గి జనుల
ఖ్యాతివంతుల చేసిన ఘన ప్రభుండు, 51

తే॥ హైదరాబాద యందునా యవతరించి
దివ్యమగు పూర్ణబోధకు దిలకమద్ది
కంద కందార్థముల ద్వార కలను మాడ్చి
ప్రజల మన్నన లందిన భాగవతుడు. 52

తే॥ సద్గురూ గీతలేగాదు శాస్త్రములను
శోధనలు చేసి బోధకు సొంపుదీర్చి

దద్ది నాంపల్లిలో వెల్గు దివ్యముగను
శంకరుడు పీలు ఖాన్వంశ శశి సముండు. 53

తే॥ తత్వములు తత్వబోధలు తరచి తరచి
తత్వముగ దీర్చి భక్తుల తత్వమరసి
తత్వరహితుల చేసిన దండి పీలు
ఖాన లక్ష్మణ ప్రభుడని ఘనులసూక్తి. 54

తే॥ పరగ చిత్తూరు గ్రామాన ప్రకటమయ్యె
దూతయై ప్రజల భ్రాంతుల తొలగజేసి
సచ్చిదానంద స్వామంచు సాధువులచె
వినుతికెక్కిన పగడాల వేంకటేశు 55

తే॥ కాకతీయుల హస్తాన కాకతీరి
యన్ని తీరుల యభివృద్ధినంది ధరలొ
పొసగ వెలిగేటి యోరుగల్ పురమునందు
నేతి శ్రీ వేంకటేశుని నేత యనిరి. 56

తే॥ వేదవేదాంత సూక్తుల విధము నెరిగి
యోరుగల్ పురమునందునా యొజ్జయయ్యె
యాగదాసని నుతికెక్కినట్టి దేశి
కేంద్రు నెరుగని వారలు యిందుగలరె ? 57

తే॥ పిల్లలామర్రి భీమన్న ప్రీతితోడ
నిత్యపూజలు చేసేటి నిర్మలాంబ
భక్తనందుని దీక్షతో బరగుచుండె.
నవని వెలిగేరు నీరీతి నచలగురులు 58

– గ్రంథకర్తృవంశవర్ణనము –

వ॥ ఇట్టి దివ్యపురుషుల సిద్ధాంత పాలకుండనగు నాపూర్వ వృత్తాంత

మిందు కొంత యుదాహరణింప వలయునన్న నైసర్గిక చాపలంబు కతంబున
చెప్పకడంగిన మా పూర్వీకుల వృత్తాంతంబెట్లన– 59

సీ॥ ఘనమైన కాకతిగడ్డపై ప్రముఖుడు । రామప్పశిల్పిచే రమ్యముగను
నిర్మింపబడినట్టి నిటలాక్షు మందిరం । బవని సవరించిన యార్యులెవరు?
పూజశూన్యంబైన భువిలో పశుపతిపూజ। బహుగ చేయించెటి భక్తులెవరు?
ప్రతియేట శివరాత్రి పండుగల్ చేయుచు । ధర్మరక్షణచేయు ధాతలెవరు?

తే॥ గీ॥ అతడె పరిపూర్ణ భక్తుడు యవనియందు
పిల్లలామఱ్ఱి వంశాన ప్రీతితోడ
మల్లయార్యుండు పత్నిజబిల్వ మాన్యరాలు
బుచ్చమాంబచే పంచమ పుత్రివడసె 60

తే॥ అందు మూడవ వాడుయై యవతరించి
రాజలింగయ నామాన రాజితముగ
రాజమాంబను సతిగూడి తేజమొప్ప
పుత్రి సప్తము నందిరీ పుడమిలోన. 61

కం॥ అందున మూడవ వాడను
పొందుగ భీమయ్య యంచు భువినను విల్వన్
యందముగ యుత్తరాంబన
మందుడనై పరిణయంబునయ్యతి ధరలో. 62

తే॥ ఇట్టి నేనిల దేవాంబ నెలమితోడ
సేవలును ద్వాదశాబ్దముల్ జేసి తుదకు
మాతృశ్రీ సూచనంబున మర్మమెరిగి
చావు పుట్టుక భ్రాంతిని సమయనైతి. 63

– భ్రాంతిరహిత పద్యరత్నావళి –

భ్రాంతుల చేతనే యహము । భ్రాంతులచేతనె నీవుయున్, యిలన్
భ్రాంతులచేతనే ప్రజలు । భ్రాంతులచేతనె బ్రహ్మవిష్ణులున్

భ్రాంతియె మూలమీ ప్రజలు । భ్రాంతియె భావపరంపరలుల్. యికీ
భ్రాంతులులేని వాడు పర । బ్రహ్మ స్వరూపుడు. భ్రాంతులేటికీ? 64

ఉ॥ త్యాగముచేయు ధర్మమును, । త్యాగముచేయు మధర్మమున్. యిలన్
త్యాగముచేయు సత్యమును । త్యాగముచేయు మసత్యమున్. యికన్
త్యాగముచేయు. చేయదగు । త్యాగము చేసిన దానిజోలికిన్
త్యాగుడవయ్యి బోవకుము । ద్వాదశిరూపుడవౌదువీ విలన్ 65

ఉ॥ సద్గురుచేత దేహమును । సన్యసివయ్యెల శాంతి బొందుము.
సద్గురు పూర్ణమున్ వలెనె । సన్నుతయోగ్యుడు. సాధుపోషకున్
సద్గురు దేహహీనుడిల । సద్గురు రూపమే సాక్షి. యీ జగం
సద్గురు. తేజమున్ గుణము । సద్గురు కీర్తు లపారమున్ యిలన్ 66

ఉ॥ బీజములేదు యీ జగము । బీజములేనిదె వృక్ష. శాఖలై
తేజమదె. యిలన్ కనుము । తియ్యనిపండ్లును. పుష్పమాదులన్
బీజ విహీనమై నొసగు । భీకర రూపమదయ్యె యీ యహం
బీజమునట్లు దోయు. నిల । బీజములేనిది మిథ్య యీ జగమ్. 67

ఉ॥ శూన్యముదృశ్యమున్. మఱియు । శూన్యము జన్మము, సూక్ష్మభావులున్
శూన్యము. భావమున్ కనుము । శూన్యము జన్మము. మృత్యువున్ గనన్
శూన్యము గాదు పూర్ణమని । సూరి జనంబులు పల్కిరిట్లయే
శూన్యముగాని పూర్ణమిట । శూన్యమనన్కలు చూడగాదగున్. 68

ఉ॥ లేవిల జన్మముల్ కనగ । లేవిల కర్మలు, లేశమాత్రమున్
లేవిల పాపపుణ్యములు । లేవిల భీతులు లేనివారికా
లేవిల. సంశయాల్కనగ । లేవిల, లేవని యెంచి చూడగా
లేవిల, యంచు బల్కు జను । లేయిల భ్రాంతిచె లేకతోచెడిగా. 69

ఉ॥ సర్వము యింద్రజాలమిది । సర్వము తోచిన యెండమావులున్.
సర్వము లేనినాడు యిల । శాశ్వత రూపుడు సాక్షిమాత్రుడై

సర్వ నియంతృడై సకల । సాధుజనాదుల బ్రోచుచున్. యిలన్
సర్వయుపాదిముక్తు, డయి । సాత్త్వికరూప సుధాంశు డుండిలన్. 70

ఉ॥ శుద్ధసుషుప్తినందు యిల । చూడగనాయుని కెందు లేదు యీ
శుద్ధము పూర్ణమండటులె । శూన్యము యేవిధిగాంచినన్ యిలన్
శుద్ధమటన్న యీ యెరుకె । శోధన చేసిన శూన్యమౌగదా.
శుద్ధముగానిదీ బయలు । సూక్ష్మపు ప్రజ్ఞచే చూడనౌభుకిన్. 71

ఉ॥ పుట్టని బ్రహ్మమందు యిల । పుట్టిన నేను సర్వమున్ కనన్
పుట్టుకలేని వారమని । పూజ్యులు పల్కిరి పూనిచూచి యీ
పుట్టినదాని నున్నదని । పూనిట చూపెడివారు లేరు. యీ
పుట్టనిదాని నున్నదని । పూర్తిగ గాంచిన భూమయోతుదన్. 72

ఉ॥ ఆత్మకు వేరెయైనదిది । ఆత్మవినాశక కేవలాత్మ మా
హాత్ములకైన తెల్యనిది । యాదిలో దేహములేని దీన్ని దు
ష్టాత్ములు తెల్యవెట్లు? కన । సాహసమందున, కర్మనాశులై
స్వాత్ములు కేవలాత్ములయి । శాశ్వత బ్రహ్మమునందిరీ యిలన్. 73

ఉ॥ క్లేశము సర్వశాస్త్రములు । క్లేశమునొందగ జేయుబుద్ధియున్
క్లేశములోయు వారిలను । క్లేశ వినాశుడు, లేశమాత్రమున్
క్లేశము లేని వానికడ । శీఘ్రమె కారణమంది, నిత్యని
త్యేష పరాత్పరాత్మునికి । సేవలు చేయుడు రెల్లవేళలన్. 74

ఉ॥ చీకటి వస్తువున్ వెదుక । చేతుల దీపము, పూనియున్ యిలన్
వ్యాకుల మొందకన్ యవల । పీడుట న్యాయమ దెట్లో గాంచు చీ
కాకులపాలు చేయు నిది । జ్ఞానము దీనిని చెందుకే సరీ.
శోకతా పూర్ణమున్ మదిని । చూచియు భావము నొందితే సరీ. 75

## — దుఃఖనివారణసూక్తి ముక్తావళి —

తే॥ ఎంత పర్యంత మీకర్మ మెలమినుండు　76
నంత, పర్యంతమే జీవులంచు దెల్పు
కర్మ లుడిగిన జీవులు కదలలేరు
నిర్మలుడవయ్యి యుండు మోసిగమ వినుత.

తే॥ అనుభవము కర్తమైనట్టి యాటలాడి　77
దేహమును క్షీణమొందించి దేహి వెడలు
విట్టి దానికై వగయుట దిట్ట తనము
యెట్టులైనను నిల్వదీవట్టి మాయ.

తే॥ ఋణము యను పాశముసుగూడ రూఢియయ్యి　78
పశులు పతులును సుతులంచు బహుగనెన్ని
దుఃఖముల పాలుచేయు యీ దోశ సహిత
యెరుక కూటమిదంచెర్గు యిందువదన.

తే॥ పండుటాకులు రాలగ పచ్చియాకు　79
లెలమి చిగురించి శోభించి యెండితుదల
రాలుచుండక నిల్చునా రమ్య హృదయ
విడువ వలెనోయి యీ మాయ వింతలన్ని.

తే॥ పారుచున్నట్టి యేటలో పడిన మొద్దు　80
నంటి యుండిన మఱియొక్క తుంట తనను
విడువకెప్పుడు నడచునా విమలచరిత
వలదు విడుమోయి యీమాయ వాంఛలన్ని.

తే॥ దినమునంతయు పక్షులు దిరుగుచుండి　81
విహగజాతులు రాత్రులు వృక్షమందు
కలిసి భాసించి యుదయానకాననమున
వేటికవె తిర్గు నీ జాతి విధమునింతె.

తే॥ కుమ్మరి సతి గంపందుకుండ లెన్నొ
యెత్తుకొని పోవ దారిలో నెత్తిపైన
కుండొకటి పల్గ ముక్కలన్ కూడ గొనదు
అట్టులే జన్మ సిద్ధాంతమంచుగనర. 82

తే॥ ప్రభువు దోచిన చెదరక పరగతండ్రి
అమ్మచూచిన మదియందు నాశలుడిగి
తల్లి విషమివ్వ సరెయని ధైర్యముగను
యుండుతే లెస్స మా తండ్రి యుర్విలోన. 83

— నిర్మలానంద నీతి చంద్రిక —

ఆ॥ రాజయోగమంటె రాజకీయముగాదు
పదవు లేముయులేవు పరగగనుడి
ముందు తెలిసి సేగమదమగు యుభయత్రి
ఆశలుడిగి రార యచల భీమ ! 84

ఆ॥ అమితమైన శాఖ యచలంబు దీనిని
నంటరాదు మనసు కంటెనేని
విడగరాదు పూర్తి విధమెర్గు వటకును
మధ్య వీడరాదు మహితభీమ ! 85

ఆ॥ పాపపుణ్య యుగము పరిపూర్ణ మందున
తరచిచూడ లేవటంచు మూర్ఖ
జనులు భువిని చోర జారత్వముల్జేయు
వారి ముఖము చూడవలదు భీమ. 86

ఆ॥ మోసకారులకును మొండి వారలకెపుడు
జూదమాడు వాక్కి చోరులకును
యచలబోధ మర్మ మబ్బదు అబ్బిన
ట్లభినయించు మూర్ఖులవని భీమ ! 87

ఆ॥ అచలబోధ నెరుగ నవనిలో కొందఱు
పూర్ణగురుని జేరి బుద్ధినిల్పి,
వివర మెరుగలేక వెఱ్ఱులయి తిరిగేడు
కనరభీమయాఖ్య! ఖలులు వీరు, 88

ఆ॥ దొంగ గురువులంత దోబూచులాడిన
దొఱుకదెపుడు పరము దొంగలకును
అంగలింగ సహిత మవ్యక్త మైనట్టి
మాయలోని వారె మహితభీమ. 89

ఆ॥ గురుని జేరలేని నరునకు దప్పదు
రవరవాడ జన్మ రంకుమాయ,
విడువ లేదు వాన్ని. విడుచును గురుజేర
మనసు పుడితె వినరమహిని భీమ. 90

ఆ॥ సేవ జేయలేని శిష్యుండు నిజమెర్గ
లేడు వాని బ్రతుకు లేశమయిన
పావనంబుగాదు బలు మూఢమతులకు
సేవలేని తపన చేటు భీమ! 91

ఆ॥ స్వార్థపరులు ముందు సద్గురు దరిజేరి
గొప్ప భక్తు లట్లు గొల్చి కొల్చి
విసుగుచెంది గురుని విధమెంచుచుందురు
అట్టి వాన్ని భీమ! యంటవలదు. 92

ఆ॥ గురునివద్ద తనదు గొప్పచాటు నరుడు
పరగ దున్నపోతు పగిదిగనర
నిజముతెల్సి చూడ నీవెక్కడుందువు
విమల సుగుణబాల వినరభీమ ! 93

ఆ॥ గురుని విడచి వేరెగురు జేరునరుడిల
వరుని విడిచి యన్యవరుని జేరు

వనిత చేష్టలట్లు వసుధందు తెలియర
సుజన వినుత భీమ సూరిభూప ! 94

ఆ॥ దీక్షితీయుమందు తీరు తెన్నెమిటి
యచల భక్తులందు నలజడేమి
శాంతి బోధజేసి. జగడంబులాడిన
వాడు బోధ కర్తుడగున? భీమ! 95

ఆ॥ లోకమందు నీచ, లుబ్ధకుండయి చాల
దోసకార్యములకు దొరగియుండి
ముసుగు వేయసెంచి ముదమున గురుమూర్తి
చెంతజేరి గొల్వ శిష్యుడగున ? 96

ఆ॥ అచలమంటె మతమ? యది తెల్యు సోదర!
చలనరహిత సూక్తి శాస్త్రమెద్ది ?
వివరమెరిగి చదువవేడ్కయై. పరిపూర్ణ
భావమబ్బు తుదుకు బయలువాదు. 97

ఆ॥ మతమునందు నైక్య మనుగడ లేకున్న
పీఠపూఠమెట్లు పెంపుజెందు
పీఠ సేవలనగ పెంపొంద జేయుతే
బుద్ధిశాలి భీమ! భువిని గనర. 99

ఆ॥ పూలు పత్రిపెట్టి పూజించినంతనె
యెఱుకపడి పోదు, యెఱుకనొదుల
హృదయ గ్రంధిజూడ సదయుడవైగను
మట్లుగాక నచల మబ్బదయ్య. 99

ఆ॥ మూడు ముక్కలిచ్చి, ముందుగ సద్గురు
పదపబోధ జేయు, ప్రీతితోడ
శ్రద్ధగల్గి, దాన్ని సాధించు తుది వఱకు
మోహమింత, లేక మొదటి నుండి. 100

## — పరిపూర్ణ బోధస్తుతి —

శ్లో॥ యస్యాంతర్నాది మధ్యే । న హి కరచరణం । న నామగోత్రం
నసూత్రం, నోజాతిర్నైవవర్ణా । న భవతి పురుషో నాన
పుంసం నచస్త్రీం, నాకారం నైవకారం । నహి జనన
మరణం । నాస్తి పుణ్యం । న పాపం, నోతత్వం తత్వ
మేకం । సహజ సమరసం। సద్గురుం తన్నమామి॥ 1

శ్లో॥ అత్మానాత్మ వినాశహేతుమనిశం । సర్వాతిరిక్తం శుభం
పూర్ణాత్పూర్ణ మనామయం । సుఖతరం సర్వాపద ధ్వంసకం
సర్వజ్ఞాన వినాశకం గురుపదం । సర్వాత్మకం నిర్మలం
సర్వభ్రాంతి వివర్జితం గుణహరం । సంపూర్ణబోధం నమః॥ 2

శ్లో॥ నజ్ఞాతం పరవస్తు నిత్య మచలం । సత్యంస్థితం శాశ్వతం
నిత్యానిత్య వివేక భేదరహితం । నిర్నామ నిర్లేపకం
సర్వప్రత్యయ హీనకంచ సతతం । సర్వత్ర సంస్థంపరం
వందేహం పరిపూర్ణబోధ మనిశం । సందేహనాశం ప్రభుం॥ 3

శ్లో॥ నాహం మనుష్యో । నచదేవయక్షో
నబ్రాహ్మణ క్షత్రియ । వైశ్యశూద్రాః
నబ్రహ్మచారీ । నగృహీవనస్థో
భిక్షునర్నచాహం । నిజబోధ రూపం ॥ 4

## - గురు పరంపర ధ్యానం -

ఓం నమోబ్రహ్మాదిభ్యో । బ్రహ్మవిద్యా సాంప్రదాయ కర్తృభ్యో వంశఋషిభ్యో। మహద్భ్యో । నమోగురుభ్యః । సర్వోపప్లవ రహిత ప్రజ్ఞానఘన ప్రత్యగర్థో । బ్రహ్మైవాహ । మస్మి । అహం పదార్థ రహితః ॥

శ్లో॥ ఓంకారపీఠ సిద్ధాంతం । బ్రహ్మవిద్యోపదేశకం
శ్రీమన్నారాయణం సూర్యం । సద్గురుభ్యో నమోనమః॥ 1

శ్లో॥ యాజ్ఞవల్క్యం చ జనకం । శుకసాందీప మీశ్వరమ్
కృష్ణ మర్జున సంయుక్తం । యుద్ధవం చ నమోనమః। 2

శ్లో॥ శ్రీధరస్వామియోగీంద్రం । శివరామాఖ్యదీక్షితం
కంబాలూరి అప్పబ్రహ్మం । సద్గురుభ్యో నమోనమః॥ 3

శ్లో॥ పరశురామ సీతారామ । భాగవత కృష్ణయోగినః
పీలుఖాన లక్ష్మణార్య । సద్గురభ్యో నమోనమః ॥ 4

శ్లో॥ బృహదారణ్యక సిద్ధాంతం । పూర్ణబోధోపదేశకం
వేంకటేశ్వర యోగీంద్రం । సద్గురుభ్యో నమోనమః॥ 5

శ్లో। బ్రహ్మవిద్య సిద్ధాంతం । నిర్మలానంద దీక్షితం
శ్రీమత్ నేతి వేంకటేశ్వర । సద్గురభ్యోనమోనమః ॥ 6

శ్లోః వేదవేదాంత సిద్ధాంతం । పూర్ణబోధోపదేశకం
ఆగయార్య రాజయోగీ । సద్గురభ్యో నమోనమః ॥ 7

శ్లో॥ బ్రహ్మవిద్య సిద్ధాంతం । భక్తానంద దీక్షితం
మాతృశ్రీ దేవమాంబా । సద్గురభ్యో నమోనమః ॥ 8

శ్లో॥ శ్రీతూడి వంశాంబుధిచంద్రం । పూర్ణచంద్రప్రదీపికం
సద్విచార ప్రవర్తం చ । దేవమాంబం గురుం భజే ॥ 9

శ్లో॥ అస్మద్గురు సమారంభం । కృష్ణ సాందీప మధ్యమాం
ఓంకారపీఠ పర్యంతాం । వందేగురు పరంపరమ్॥ 10

## – (శ్రీ) నిజగురు లఘు పూజా విధానము –

శ్లో॥ గురుర్బ్రహ్మా గురోర్విష్ణుం । గురుదేవో మహేశ్వరః
గురుసాక్షాత్ పరంబ్రహ్మం । తస్మై శ్రీగురవేనమః ॥ 1

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం । కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగన సదృశం । తత్వమస్యాది లక్ష్యం

ఏకం నిత్యం విమల మచలం । సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం । సద్గురుం తన్నమామి॥ 2

శ్లో॥ ధ్యానమావాహనం సింహాసనం । పాద్యం తథైవచ
అర్ఘ్యమాచమనీయ్యంచ । స్నానం పంచామృతైస్సహ॥ 3

శ్లో॥ శుద్ధోదకం వస్త్రయుగ్మం । యజ్ఞసూత్రిం విభూషణం
విలేపనం చాక్షతాంశ్చ । పుష్పం స్వర్ణ వినిర్మితం ॥ 4

శ్లో॥ ధూపదీపం చ నైవేద్యం । పానీయ్యం ఫలమేవ చ
తాంబూలం దక్షిణార్థికం । మంత్రపుష్పం ప్రదక్షణం। 5

శ్లో॥ నమస్కారం దేశికేంద్ర । మయాతుభ్యం నివేదితమ్
కృపయాగృహ్యతాంస్వామిన్ । న్యూనాధిక్యంనచింతయా॥ 6

శ్లో॥ లఘుపూజావిధిన్ భాగ । వత కృష్ణ ద్వజన్మనా
రచితంశోతృ వక్తృణా । మిదం మోక్షకరం పరం ॥ 7

## – శ్రీ గురుమాలా మంత్రము –

ఓం నమః శ్రీ గురుదేవాయ । పరమ పురుషాయ । సర్వదేవతా వశీకరాయ । సర్వారిష్ట వినాశాయ । సర్వమంత్రచ్ఛేదనాయ । త్రైలోక్య వశమానాయ స్వాహా ॥

(ఈ మంత్రమును చిత్తశుద్ధిగల్గి 5–108 వరకు యెన్నైన జపించవచ్చును అనుష్ఠాన సమయన)

## – ద్వా ద శా క్ష రి –

అస్య శ్రీ ద్వాదశాక్షరీ మహామంత్రస్య । అచలఋషిః । అపనా ఛందః । అభవో దేవతా । అమృతం బీజం । అప్రమేయాశక్తిః । అయమాత్మా తత్వమస్యాది జ్ఞానరహితం కీలకం ॥ అఖిలకాషు పరిపూర్ణమస్తి । మాయా

సహిత మేతత్ప్రపంచం । నాస్తీతి నిశ్చయ సిద్ధ్యర్థం ద్వాదశాక్షరీ మహా మంత్ర జపం కరిష్యే ॥

## – అథ కరన్యాసః –

ఏతస్మిధ్యా = అంగుష్ఠాభ్యాన్నమః । శుద్ధవియత్ = తర్జనీభ్యానమః । కించిన్నాస్తి = మధ్యమాభ్యాన్నమః । ఏతన్మిధ్యా = అనామికాభ్యాం నమః। శుద్ధవియత్ = కనిష్టకాభ్యాం నమః। కించిన్నాస్తి = కరతలకరపృష్ఠాభ్యానమః॥

## – అథ హృదయాదిన్యాసః –

ఏతన్మిధ్యా = హృదయాయనమః । శుద్ధవియత్ = శిరసేస్వాహా । కించిన్నాస్తి = శిఖాయైవషట్। ఏతన్మిధ్యా = కవచాయహుం । శుద్ధవియత్ = నేత్రత్రయాయవౌషట్ । కించిన్నాస్తి = హస్త్రాయఫట్ । దష్టదర్శన దృశ్యాద సహితః అహం పదార్థ రహితః ॥

భూర్భువస్సువరోమితి దశదిగ్బంధః

శ్లో॥ ఏతన్మిధ్యా శుద్ధవియత్ । కించిన్నాస్తీతి తేమయా
కృపయా పరమం ప్రోక్తం । భజాగ్రే ద్వాదశాక్షరం ॥

## – అథ మనుః –

| ఏతత్ | మిధ్యా | శుద్ధ | వియత్ | కించి | న్నాస్తి |
|---|---|---|---|---|---|
| ఈ | వుత్త | బట్ట | బయలు | ఏమి | లేదు |

## – షోడశాక్షరి –

అస్య శ్రీ షోడశాక్షరి మహా మంత్రస్య । నిరంజనఋషిః । నిరహంకారః ఛందః । నిరామయ నిరాకాశో దేవతా । నిరావరణబీజం ॥ నిస్త్రైయి గుణాత్మక శక్తిః । నిర్గుణప్రజ్ఞానరహిత కీలకం । నిఖిలకాలేషు మాయాసహిత భూతపంచక నిర్మిత దశేంద్రియ పంచప్రాణ మనోబుద్ధి సహితః సూక్ష్మ శరీర రహిత సిద్ధ్యర్థం. షోడశాక్షరీ మహామంత్ర జపం కరిష్యే ॥

## - అథ కర న్యాసః -

నిర్మాలం = అంగుష్ఠాభ్యాం నమః । ఏతత్ = తర్జనీభ్యాం నమః। జ్ఞానాచ్ఛరీరం = మధ్యమాభ్యాం నమః । నాస్తి = అనామికాభ్యాం నమః। కేవలం = కనిష్టికాభ్యాం నమః। నాస్తి కేవలం = కరతలకరపృష్ఠాభ్యాం నమః ॥

## - అథ హృదయాదిన్యాసః -

నిర్మాలం = హృదయాయనమః । ఏతత్ = శిరసేస్వాహా । జ్ఞానాచ్ఛరీరం = శిఖాయైవషట్ । నాస్తి = కవచాయహుం । కేవలం = నేత్రత్రయాయవౌషట్ । నిర్మాలమేతదా జ్ఞానాచ్ఛరీరం నాస్తికేవలం = హస్త్రాయఫట్ । సమస్త నిర్మోహాయ త్రైలోకేషు, మదర్పిత, నిశ్చయో ॥

భూర్భువస్సువరోమితి దశ దిగ్బంధః

శ్లో॥ నిర్మాలమే తదాజ్ఞానా । చ్ఛరీరం నాస్తి కేవలం
షోడషాక్షరితత్ సిద్ధ । మిదం వస్త్వనిశంభజే ॥ 2

## - అథ మనుః -

| నిర్మాల | మేతదా, | జ్ఞాన, | చ్ఛరీరం | నాస్తి | కేవలం |
|---|---|---|---|---|---|
| మూలంలేని | యీ. | గురైనే, | శరీరం | యేమి | లేదు. |

## - దృష్టదార్ష్టాంతము -

శ్లో॥ స్వప్నెప్రతీయమానాని । రూపాణి చ యథాతథా
కర్పూరదీప సంయోగం । జ్యోతిరూపం యథాతథా॥ 3

దృ॥ కలలోదోచిన శరీరములు యేలాగో అలాగే
దా॥ కర్పూరము కళికిమాడితె యేలాగో అలాగే.

శ్లో॥ ఇతి మంత్ర సమాసైన । సాందీప గుర్వగ్రణి
కృష్ణస్య మస్తకేనస్య । హాస్తం తూష్ణిం బభూవహ ॥ 4

శ్రీ సద్గురు చరణార విందార్పణమస్తు.

# గురుపూజా విధానము

శ్లో॥ హృత్పుండరీక మధ్యస్థం । సకలామ్నాయ సంస్తుతం
ధ్యాయామ్యహంసదాభక్త్యా । సకలాభీష్టదాయకం 1

శ్రీమత్ భక్తానందతూశి దేవమాంబ రాజయోగిని స్వగురు పరమగురు పరమేష్ఠిగురు, సద్గురు, జగద్గురు, నిజగురు పరిపూర్ణగురు పరబ్రహ్మణేనమః

— ధ్యా నం స మ ర్ప యా మి —

శ్లో॥ ఆగచ్ఛానంత దేవేశ । భోగమోక్షప్రదాయక
నాకేశముఖ లోకేశ । వందితాంఘ్రిద్వయాంబుజం 2
శ్రీమ॥ ఆవాహనం । సమర్పయామి

శ్లో॥ రత్న సింహాసనంవందే । సంగృహాణ సమర్పితం
చంద్రమండల సంకాశ । సస్మితానన పంకజ 3
శ్రీమ॥ అనేక మణిమయ రత్నఖచిత సింహాసనం । సమర్పయామి

శ్లో॥ పాద్యంగృహాణభో స్వామిన్ । మయానీతం శుభప్రదమ్
కృష్ణవేణీ జలం భక్త్యా । తీర్థపాద జగద్గురో 4
శ్రీమ॥ పాదయోః పాద్యం । సమర్పయామి

శ్లో॥ అర్ఘ్యం దాస్యామ్యహంభక్త్యా । తవపాణితలేవిభో
గోదావరీజలం హేమ । కలశస్థంసువాసితమ్ 5
శ్రీమ॥ హస్తయోః అర్ఘ్యం । సమర్పయామి

శ్లో॥ ఆచమ్యతాంమయాందత్తం । హేగుకోయమునాజలమ్
త్వదర్థంకృపయాభావ । భవబాధానికృన్తన 6
శ్రీమ॥ ముఖే ఆచమనీయం । సమర్పయామి

శ్లో॥ శర్కరా దధిమద్వాజ్య । క్షీరమిశ్రమిదంవిభో
పంచామృతంమయాదత్తం । స్నానం కురుజగత్పతే 7
శ్రీమ॥ పంచామృతస్నానం । సమర్పయామి

శ్లో॥ తప్తకాంచనకుంభస్థం । కించి దూష్ణ సువాసితమ్
మయానీతం జహ్నుకన్యా । జలస్నానం కురుప్రభో 8
శ్రీమ॥ శుద్ధోదక స్నానం । సమర్పయామి

శ్లో॥ వస్త్రయుగ్మంమయాదత్తం । త్వదర్థ స్వర్ణతంతుభిః
నిర్మితం నిర్మలంస్వామిన్ । నిత్యకల్యాణపావన 9
శ్రీమ॥ అలంకరణార్థం వస్త్రయుగ్మం । సమర్పయామి.

శ్లో॥ కార్పాసతంతునా శుభ్రం । రచితం తేఽర్పితం మయా
సంగృహాణ మిదం యజ్ఞం । సూత్రి పాత్రం దయానిధే 10
శ్రీమ॥ యజ్ఞోపవీతం । సమర్పయామి

శ్లో॥ కిరీటం కుండలం రత్న । కంకణాదీనితే మయా
సంగృహ్యతాం భూషణాని । అర్పితాని నిరంజన 11
శ్రీమ॥ సర్వాభరణభూషణాన్ । సమర్పయామి.

శ్లో॥ మలయాచల సంభూతం । కర్పూర కలితంవిభో
విలేపనం త్వదర్థం భో । గృహ్యతా మర్పితం మయా 12
శ్రీమ॥ గంధం । సమర్పయామి

శ్లో॥ తండులాన్ ధవళాకారాన్ । హరిద్రాచూర్ణ మిశ్రితాన్
గృహ్యతా మక్షతాన్ దేవ । మయాదత్తాన్మనోహరాన్ 13
శ్రీమ॥ అక్షతాన్ । సమర్పయామి

శ్లో॥ పుష్పాణ్యనేకాని సుపల్లవాని । సుగంధయుక్తాణిమనోహరా!
త్వాంగృహ్యతాం దేవమయార్పితాని। జలాశయ స్థాని జపాదికాని 14
శ్రీమ॥ పుష్పం । సమర్పయామి

## —అథాంగపూజా—

1 తీర్థపాదాయనమః । పాదౌ । పూజయామి
2 నిగమమంజీరాయనమః । గుల్ఫౌ । పూజయామి
3 స్మరతూణీరజంఘాయనమః । జంఘే । పూజయామి
4 ముక్తికాంతా సేవితాయనమః । జానునీం । పూజయామి
5 రత్నస్తంభోరు యుగళాయనమః । ఊరూ । పూజయామి
6 పులినతల జఘనాయనమః । జఘనౌ । పూజయామి
7 మణికాంచీ కలాపశోభితాయనమః । కటిం । పూజయామి
8 గంభీర నాభీమండలాయవమః । నాభిం । పూజయామి
9 విశ్వోదరాయనమః । ఉదరం । పూజయామి
10 దఃమూర్ద్రి హృదయాయనమః । హృదయం । పూజయామి
11 విశాల వక్షస్తేనమః । వక్షస్థలం । పూజయామి
12 కంబుగ్రీవాయనమః । కంఠం । పూజయామి
13 వరదా నధురీణాయనమః । హస్తౌ । పూజయామి
14 ఉన్నతస్కంధాయనమః । భుజౌ । పూజయామి
15 స్మిత వక్త్రాయనమః । వక్త్రం । పూజయామి
16 చంపక నాసాయనమః । నాసికాం । పూజయామి
17 పల్లవాధరాయనమః । అధరం । పూజయామి
18 పుండ్రేక్షు కార్ముకభ్రువేనమః । భ్రూయుగ్మం । పూజయామి
19 కరుణాకటాక్ష వీక్షణాయనమః । నేత్రౌ । పూజయామి
20 పుష్టకర్ణాయనమః । కర్ణౌ । పూజయామి
21 రాకాసుధాంశు వదనాయనమః । ముఖం । పూజయామి
22 సు లలాటాయనమః । లలాటం । పూజయామి
23 నీలకుంచిత మూర్ధజాయనమః । కేశాన్ । పూజయామి
24 సువృత్త శిరస్కాయనమః । శిరం । పూజయామి
25 సర్వాత్మనేనమః । సర్వాంగాణి । పూజయామి

శ్రీమః అనేకాంగాని పూజ సమర్పయామి

## - అథపత్రపూజా -

1 అచింత్యాయనమః – బిల్వపత్రం – సమర్పయామి
2 బృందారక వందితాయనమః – తులసీదళం – సమర్పయామి
3 భువనరక్షణ తత్పరాయనమః – వకుళపుష్పం – సమర్పయామి
4 భూరి విభవాయనమః – పున్నాగపుష్పం – సమర్పయామి
5 జగజ్జనన కారణాయనమః – కేతకీపుష్పం – సమర్పయామి
6 చరాచర గురవేనమః – చామంతికాపుష్పం – సమర్పయామి
7 సు ప్రభావాయనమః – చంపకపుష్పం – సమర్పయామి
8 సు ప్రసన్నాయనమః – పాటలీపుష్పం – సమర్పయామి
9 అపవర్గప్రదాయనమః – శతపత్రపుష్పం – సమర్పయామి
10 అనంతాయనమః – జాజీపుష్పం – సమర్పయామి
11 మోహవర్జితాయనమః – కరవీరపుష్పం – సమర్పయామి
12 ముకుందాయనమః – రసాలపుష్పం – సమర్పయామి
13 ప్రకృతి పురుషవిలక్షణాయనమః – మాలతీపుష్పం – సమర్పయామి
14 నిత్యాయనమః – కల్హారపుష్పం – సమర్పయామి
15 ఆగ్నేయచక్ర నిలయాయనమః – అతసీపుష్పం – సమర్పయామి
16 నాదుబిందుకళాతీతాయనమః – పారిజాతపుష్పం – సమర్పయామి
17 భూతాత్మనేనమః – అశోకపుష్పం – సమర్పయామి
18 మండల త్రయాతీతాయనమః – నీలోత్పలపుష్పం – సమర్పయామి
19 అనంతాయనమః – మల్లికాపుష్పం – సమర్పయామి
20 అవ్యక్తాయనమః – మాలతీపుష్పం – సమర్పయామి

శ్రీ మః॥ అనేకపత్రపూజ సమర్పయామి

## -: 108 అథాష్టోత్తర శతనామాని ;-

1) సద్గురవేనమః 2) పూర్ణాయనమః 3) సర్వాధారాయ నమః 4) స్వేచ్ఛాయనమః 5) శుద్ధాయనమః 6) నిర్మలాయ

నమః 7) విశ్వోదరాయనమః 8) నిరాలంబాయనమః 9) రమ్యా
యనమః 10) నిర్లేపాయనమః 11) నిర్వాసనాయనమః 12) నిర్గంధా
యనమః 13) స్వప్రకాశాయనమః 14) నిత్యతృప్తాయనమః
15) అనంతాయనమః 16) అద్వితీయాయనమః 17) వేదవేదాను
వేద్యాయనమః 18) పరంజ్యోతిషేనమః 19) ప్రణవాతీతాయనమః
20) అచలాయనమః 21) అపరిమితాయనమః 22) అప్రమేయా
యనమః 23) అవ్యయాయనమః 24) అచ్యుతాయనమః 25) అహం
కార వివర్జితాయనమః 26) విశ్వాత్మనేనమః 27) ప్రపంచాతీతా
యనమః 28) మానసీయాయనమః 29) క్షరాక్షరవిలక్షణాయనమః
30) దృగ్దృశ్యాతీతాయనమః 31) ద్వైతాద్వైత వినిర్ముక్తాయనమః
32) అఖండాయనమః 33) ఖండాఖండవిరహితాయనమః 34) ఆది
మధ్యాంత శూన్యాయనమః 35) నిరంజనాయనమః 36) నిర్వికల్పా
యనమః 37) నిరాకారాయనమః 38) నిరాఖ్యాతాయనమః 39) పర
మానంద స్వరూపాయనమః 40) సగుణనిర్గుణాతీతాయనమః 41) సర్వ
సాక్షిణేనమః 42) సాక్ష్యతీతాయనమః 43) త్రిగుణాతీతాయనమః
44) సర్వభూతాంతరస్థాయనమః 45) సుఖదుఃఖ విరహితాయనమః
46) జన్మజరామరణ వర్జితాయనమః 47) క్షేత్రజ్ఞాయనమః 48) సర్వో
పనిషత్సారాయనమః 49) నిష్కలంకాయనమః 50) నిరాభాసాయనమః
51) స్వప్రకాశాయనమః 52) సృష్టిస్థిత్యంతకారణాయనమః 53) కర్తృ
త్వరహితాయనమః 54) సచ్చిదానందాతీతానమః 55) అపరోక్షా
యనమః 56) సకలమంత్రస్వరూపాయనమః 57) ఆకాశతనువేనమః
58) నిరాధారాయనమః 59) నిస్తేజసేనమః 60) అవికారాయనమః
61) అ[illegible]లాయనమః 62) పరతత్వాయనమః 63) పరంధామ్నే
నమః 64) అజాయనమః 65) అగమ్యాయనమః 66) షడ్గుణై
శ్వర్య సంపన్నాయనమః 67) సనాతనాయనమః 68) త్రిమూర్త్యా
త్మనేనమః 69) అనాద్యంతాయనమః 70) సర్వోపాధివినిర్ముక్తాయ
నమః 71) భక్తాభీష్ట ఫల ప్రదాయనమః 72) భవరోగభేషజాయనమః
73) సహస్రార చక్రమధ్యస్థాయనమః 74) సనకాది మునివందితాయ

నమః 75) కామక్రోధాది శత్రుకృతాంన్తాయనమః 76) కరుణారసార్ద్ర హృదయాయనమః 77) బ్రహ్మావిష్ణు మహేశ్వరస్తుతాయనమః 78) బ్రహ్మాండజనకాయనమః 79) పరమపావనాయనమః 80) దీనజనానుగ్రహాయనమః 81) దివ్యపురుషాయనమః 82) ప్రసన్న పారిజాతాయనమః 83) పురాణ పురుషాయనమః 84) నిరుపద్రవాయనమః 85) నిత్య కల్యాణాయనమః 86) సర్వోపని షత్పంజరకీరాయనమః 87) శబ్దాతీతాయనమః 88) జగన్నాధాయనమః 89) జగద్గురవేనమః 90) విష్ణవేనమః 91) సర్వతోభద్రాయనమః 92) నిగమార్థప్రతిపాదకాయనమః 93) నిస్సంగాయనమః 94) సహజానందాయనమః 95) చిన్మయాయనమః 96) శ్రీమతేనమః 97) సహజామనస్కాయనమః 98) సాయుజ్య ప్రదాయనమః 99) పంచబ్రహ్మమయాయనమః 100) అజడాయనమః 101) జడాజడ విలక్షణాయనమః 102) భావాభావమధ్యస్థాయనమః 103) అమనస్కాయనమః 104) అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకాయనమః 105) సర్వాదయేనమః 106) పరాత్పరాయనమః 107) లక్ష్యాతీతాయనమః 108) మనోవాగగోచరాయనమః

శ్రీమ॥ నానావిధ పరిమళ పత్రిపుష్పాన్ సమర్పయామి

శ్లో॥ చందనాగరు కర్పూర । శర్కరాజ్య సమన్వితమ్
ధూపోఽయం గృహ్యతాంస్వామిన్ । త్వ మిదం తే మయార్పితమ్॥
శ్రీమ॥ ధూపమాఘ్రాపయామి

శ్లో॥ వహ్నినాయోజితంసాజ్యం । దీపంవర్తిత్రయాన్వితమ్
గృహాణ జ్ఞానతిమిర । హర జ్ఞాన ప్రవర్ధనమ్ 16
శ్రీమ॥ దీపం దర్శయామి

శ్లో॥ శాల్యన్నం షడ్రసోపేతం । పంచభక్ష్యాది సంయుతమ్
నైవేద్యం దేవదధ్యాజ్య । సమ్మిశ్రం ప్రతిగృహ్యతామ్ 17
శ్రీమ॥ మహానైవేద్యం । సమర్పయామి

శ్లో॥ పానీయం శీతలం స్వచ్ఛం । మధ్యేమధ్యే మయార్పితం
సుగంధయుక్తం మధురం । పిబత్వం పురుషోత్తమ । 18

శ్రీమ॥ మధ్యేమధ్యే ఉదకపానీయం । సమర్పయామి

శ్లో॥ సుపక్వాన్యనేకాని । రంభామ్రి జంబూ స్వఖర్జూర । నారంగ
దాక్షాది కానిత్వ మేతాని । సంగృహ్యతాం స్వ ప్రికాశ 19
ఫలాని ప్రిదేయాని సర్వాణి తేఽద్య

శ్రీమ॥ ఫలోపహార నైవేద్యం । సమర్పయామి

శ్లో॥ తాంబూలంగృహ్యతాంపూగి । ఫలకర్పూర సంయుతమ్
నాగవల్లి దళాద్యంతం । గురోతుభ్యం మయార్పితం 20

శ్రీమ॥ తాంబూలం । సమర్పయామి

శ్లో॥ సువర్ణోదర గర్భస్త్వం । స్వర్ణబీజం మయార్పితం
అనంతపుణ్యదంస్వామిన్ । తే గృహాణాత్వ మచ్యుత 21

శ్రీమ॥ సువర్ణపుష్ప దక్షిణాం । సమర్పయామి

శ్లో॥ నీరాజనంమయాదత్తం । రాజరాజేశ పూజితమ్
గృహాణజగదుత్పత్తి । హేతుభూతాఽఘనాశన 22

శ్రీమ॥ మంగళనీరాజనం । సమర్పయామి

శ్లో॥ సుకేతకీపాటల పారిజాత । చాంపేయ కంజాత రసాల మల్లికా
చామంతికా సం యుత మంత్రపుష్పం।గృహాణవిష్ణో శివశంకరాచ్యుత

శ్రీమ॥ దివ్యసువర్ణ మంత్రపుష్పం । సమర్పయామి 23

శ్లో॥ జన్మాంతరకృతాన్యాని । యానిపాపాని మే ప్రిభో
నశ్యంతు తే తానితాని । ప్రిదక్షిణ పదేపదే 24

శ్రీమ॥ ఆత్మప్రిదక్షిణ నమస్కారాన్ । సమర్పయామి

శ్లో॥ యస్యస్మృత్యాచ నామోక్త్యా । తపఃపూజాక్రియాదిషు
న్యూనంసంపూర్ణతాంయాన్తి । సద్యోవందే త మచ్యుతమ్ 25

శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం । భక్తిహీనం జనార్దన
యత్పూజితం మయాదేవ । పరిపూర్ణం తదస్తుతే 26

శ్లో॥ భాగవతకృష్ణ భూసురరచిత మిదం । దేశికస్యపూజార్థం
పూజావిధానం శమతులం । వక్తృశ్రోతృద్వయోశ్చ మోక్షకరం 27

ఇతి శ్రీమద్భాగవతకృష్ణ విరచిత । గురుపూజావిధానం
సమాప్తమ్.

శ్రీ పిల్లలమఱ్ఱి భీమయార్య సద్గురవేనమః

శ్లో॥ శ్రీ సద్గురు భక్తానందపాద । కమలామృత ప్రాశనభృంగమ్
శ్రీనిర్మలానంద బోధోపదేశకమ్ । భీమయార్య గురుచరణంభజే॥ 1

శ్లో॥ పిల్లలమఱ్ఱి వంశాంబుధిచంద్రం । పూర్ణచంద్ర ప్రదీపికం
సద్విచార ప్రవర్తం చ । భీమయార్య గురుంభజే॥ 2

- శ్రీ శివరామదీక్షిత గురుపీఠ మంగళహారతి -

హారతిదిగో । మంగళ । హారతిదిగో ॥హార

1 హారతిదిగో జగతియందున । అచల పరిపూర్ణాత్మతత్వవి
చారులగుసాందీపమహాఋషి । స్వాములకును కృష్ణునకును ॥హార

2 పండరీపురమందు నిలచి । భాగవత భగవద్గీత ల
ఖండముగ భక్తులకు దెల్పిన । కారణుండగు శ్రీధరేంద్రుల ॥హార

3　వాసిగా బృహద్వాసిష్ఠము । వ్రాసినారాయణ పురంబున
దేశములలో ప్రకటనపరచిన । దేశికులు శివరాములకును　॥హార

4　స్థిరముగను కంబాలూరి । పురమునందున అచలబోధను
మురయుచును భక్తులకు దెల్పి । ముక్తినొసగిన అప్పరావుకు　॥హార

5　పరమపావనమైన యెరగొండ । పాళెమున భద్రాద్రిరామ
పరమశతకము వ్రాసినట్టి । పరశురామ నారసింహుల　॥హార

6　మరియునా పాళెములో వెలచి । పరమతత్వము బోధపరచిన
పరశురామ వంశభవ శ్రీ । ప్రభువు సీతారాములకును　॥హార

7　దక్కన్ హైదరబాదులోపల । మక్కువతో కందార్థకందముల్
చక్కగను రచియించినట్టి । సద్గురుభాగవత కృష్ణున　॥హార

8　దీక్షతో నాంపల్లియందున । దివ్యముగ గురుగీత అచలము
సాక్షిగా భక్తులకు దెలిపిన । స్వామిఫీల్ఖాన్ శంకరునకు　॥హార

9　మేలుగను బేగంపేటలో । చాలగా పరతత్త్వములు గురు
బాలురకును బోధపరచిన । ఫీలుఖానా లక్ష్మణార్యుల　॥హార

10　ధరను శ్రీశివరామదీక్షిత । గురుపీఠ వేదాంతగ్రంథము
తెరుకపరచే వెంకటేశ్వర । పరమయోగికి భక్తులకును　॥హార

11　భూతలంబున ఖ్యాతికెక్కియు । ధాతవై భక్తులకుజన్మల
భీతులన్నియు బారద్రోలిన । నేతి వేంకటేశ్వరునకు　॥హార

12　భాసురంబుగ మట్టెవాడ ని । వాసవాడపల్లి అగయు
దేశికోత్తములయ్యి యెరుకను । బాళిభక్తుల నేలుగురునకు　॥హార

13　వాసిగా శివనగరమందున । స్థాపితంబౌ పీఠమందున
దాసులకు పరిపూర్ణబోధ । జేసె దేవమాంబ గురునకు　॥హార

14　భువిని పాలంపేటయందున । పూర్ణబోధను దెల్యపరచే
సద్గురూ శ్రీ భీమయాఖ్య । స్వామి నీకిదె జయశుభమంగళ　॥హార

15　మరియును పీఠస్థులకును । పరమతత్త్వ విచారులకును
నిరతము వేదాంతసభతో । నిలకడైన సాధువులకును　॥హార

# — గురు పరంపరా మంగళారతి —

1) శ్రీకరంబైనట్టి — ఓంకార పీఠమున — ప్రాకటంబుగ హరికి — భానునకును — ఏకముగ వెలిగేటి — యాజ్ఞవల్క్యకి మరియు — జోకతో రాజఋషి — జనకపతికీ — జయమంగళం నిత్య శుభమంగళం — జయతు జయమంగళం మహోత్సవ మంగళం ॥

2) శుద్ధతత్వజ్ఞుడౌ — శుకయోగికిని నిత్య — సద్ధర్మమార్గుడౌ—సాందీపునకు — సిద్ధముగ పూర్ణుడౌ — శ్రీకృష్ణమూర్తికిని — ఒద్దికతో అర్జున—యుద్ధవులకూ ॥జయమంగళం॥

3) శ్రీమించి వెలిగేటి — శ్రీధరస్వామికి — ధీమించు శివరామ — దీక్షితులకు—కామితార్థములిచ్చు — ఘనఅప్పబ్రహ్మముకు— వేమారు శ్రీసీతరాములకునూ ॥జయమంగళం॥

4) పరిపూర్ణబోధను — ప్రకటపరచిన యట్టి — వరభాగవత కృష్ణ—గురునకిపుడు — నిరతంబు పరతత్వ — మెరిగించెపేక్లాన — వరలక్ష్మణప్రభు—చరణములకూ ॥జయమంగళం॥

5) గురుతుగా ఓంకార — గురుపీఠ సిద్ధాంత — పరమతత్వార్థము — భక్తులకును — కరుణతో బోధించి — కడతేర్చి నటువంటి — వరవేంకటేశ్వర గురునకిపుడూ ॥జయమంగళం॥

6) ఓరుగల్లు పురమందు — గిరుమాజిపేటలో — గురుమందిరంబును—గుర్తుపరచి — పరిపూర్ణబోధను — ప్రకటించినట్టి శ్రీ — పరనేతి వేంకటేశ్వరునకిపుడూ ॥జయమంగళం॥

7) భువిలోన పరిపూర్ణ — బోధమర్మము జెప్పి — భవనాశస్థితిలేని—బాటజూపి — స్తవనీయభక్తులను—దరిజేర్చి నటువంటి — దివిజుండు అగయ్య దేశికునకూ ॥జయమంగళం॥

8) వరశివానగరిలో – భక్తానందాశ్రమున – పరిపూర్ణబోధను – భద్రపరచి – పరమభక్తులకెల్ల – జన్మకర్మలుబాపె–వరదేవమాంబ చరణములకూ ॥జయమంగళం॥

9) తెనుగుదేశమునందు దివ్యమై వెలిగేటి – పాలమూపేటలో ప్రకటమయ్యె నిర్మలంబగు – బోధ మర్మధర్మము దెల్పె కర్మరహితుడు – భీమయాఖ్యునకును జయమంగళం॥

# ద్వాదశి నమస్కారములు

శ్లో॥ శ్రీ సమంచిత మవ్యయం । పరమ ప్రకాశ మగోచరం
భేదవర్జిత మప్రమేయ । మనంత మాధ్యమ కల్మషం
నిర్మలం నిగ మాంత మద్వయ । మప్రితతర్క్యమ బోధకం
ప్రాతరేవహి మానసాంతర । భావయేద్గురు పాదుకం॥ 1

శ్లో॥ నాదుబిందు కళాత్మకం । దశనాదభేద వినోదకం
మంత్రిరాజ విరాజితం । నిజమండలాంతర భాసితం
పంచవర్ణ మఖండ మద్భుత । మాదికారణ మత్యుతం
ప్రాతరేవహి మానసాంతర । భావయేద్గురు పాదుకం॥ 2

శ్లో॥ స్థూలసూక్ష్మ సకారణాంతర । ఖేలనం పరిపాలనం
విశ్వతైజస ప్రాజ్ఞచేతస । మంతరం నిఖిలాత్మకం
చిత్కళా పరిపూర్ణమంతర । చిత్సమాధి నిరూఢనం
ప్రాతరేవహి మానసాంతర । భావయేద్గురు పాదుకం॥ 3

శ్లో॥ పంచపంచ హృషీకదేహ । మనోచతుష్క పరస్పరం
పంచభూత సకామ షట్కస । మీశ శబ్ద నిరంతరం
పంచకోశ గుణ త్రియాది । సమస్త ధర్మ విలక్షణం
ప్రాతరేవహి మానసాంతర । భావయేద్గురు పాదుకం॥ 4

శ్లో॥ వ్యోమవద్బహిరంతర స్థిత । మక్షరం నిఖిలాత్మకం
కేవలం పరిపూర్ణ మేక । మజన్మ హి ప్రతిరూపకం
బ్రహ్మతత్వ వినిర్మితం । విరతాను మోక్షమ బోధకం
ప్రాతరేవహి మానసాంతర । భావయేద్గురు పాదుకం॥ 5

శ్లో॥ బుద్ధిరూపమ బుద్ధకం । త్రితయైకకూట నివాసినం
నిశ్చలం నిరతప్రకాశ । మనేక సదృశ మూలకం
పశ్చిమాంతర ఖేలనం । నిజసిద్ధ సంయమ గోచరం
ప్రాతరేవహి మానసాంతర । భావయేద్గురు పాదుకం॥ 6

శ్లో॥ హంసచార మఖండనాద । మనేక వర్ణమ రూపకం
శబ్దజాలమయం చరాచర । జంతుదేహ నివాసినం
చక్రరాజ మనాహతోద్భవ । మేకవర్ణ మతః పరం
ప్రాతరేవహి మానసాంతర । భావయేద్గురు పాదుకం॥ 7

శ్లో॥ తప్తకాంచన దీప్యమాన । మహాణురూపమ రూపకం
చంద్రకాంతర తారకైరస । ముజ్వలం పరమం పదం
నీలనీరద మధ్యమస్థిత । విధ్యుదావళి భాసితం
ప్రాతరేవహి మానసాంతర । భావయేద్గురు పాదుకం 8

శ్లో॥ హృద్గతం విమలం మనోజ్ఞ । విభాసితం పరమాణుకం
హీరమధ్య సునీల సన్నిభ । మాదిబిందు నిజాంశకం
సూక్ష్మకర్ణిక వాసినం । జలవహ్ని రూపక మీశ్వరం
ప్రాతరేవహి మానసాంతర । భావయేద్గురు పాదుకం॥ 9

శ్లో॥ పంచవర్ణ శుకం సమస్త । రుచిర్విచిత్ర విచారిణం
చంద్రసూర్య చిదగ్నిమండల । మండితం ఘన చిన్మయం
చిత్కళా పరిపూర్ణమంతర । చిత్సమాధి నిరీశ్వరం
ప్రాతరేవహి మానసాంతర భావయేద్గురు పాదుకం॥ 10

శ్లో॥ పంచభూత సులక్ష దక్షణ । భావమాత్ర నిరూపణం
విద్యుదాది ధగ ధగ ధగితం । వినోద వివర్ధనం
భిన్నమాత్రయ వర్తనం సదసద్విలాస మమాయికమ్
ప్రాతరేవహి మానసాంతర । భావయేద్గురు పాదుకం॥ 11

శ్లో॥ జన్మకర్మ విలీనకారణ । హేతుభూత మభూతకం
జన్మకర్మ నివారకం రుచి । పూరకం భవతారకం
నామరూప వివర్జితం । నిజనాయకం సుఖదాయకం
ప్రాతరేవహి మానసాంతర । భావయేద్గురు పాదుకం॥ 12

# గురు వాక్యోపనిషత్తు

శ్లో॥ ఖం వాయు ర్జ్యోతి రాపః । పృథ్వీ విశ్వస్యధారిణీ
యత్పరం బ్రహ్మసర్వత్ర । విశ్వస్యాయతనం మహత్॥ 1

శ్లో॥ సూక్ష్మత్సూక్ష్మతరం నిత్యం । తత్వమేవ త్వమేవతత్
జాగ్రత్స్వప్న సుషుప్త్యాది । ప్రపంచం యత్ప్రకాశతే
తద్బ్రహ్మహ మితిజ్ఞాత్వా । సర్వబంధైః ప్రముచ్యతే॥ 2

శ్లో॥ యోవేదాదౌ స్వరః ప్రోక్తో । వేదాంతే చ ప్రతిష్ఠితః
తస్య ప్రకృతిలీనస్య । యః పరస్స మహేశ్వరః॥ 3

శ్లో॥ ద్రష్టృదర్శన దృశ్యానాం । నిరామోయత్ర వా లభేత్
దృష్టిస్తత్రైవకర్తవ్యా । ననాసాగ్రావలోకనే॥ 4

శ్లో॥ అంతఃపూర్ణం బహిఃపూర్ణం । పూర్ణకుంభ మివాంబరే
అంతఃశూన్యం బహిశ్శూన్యం । శూన్యకుంభ ఇవాంబరే॥ 5

శ్లో॥ ఈశానస్సర్వ విద్యానా మీశ్వరస్సర్వ భూతానాం
బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోధిపతిర్బ్రహ్మాశివో మెఅస్తు సదాశివోం॥ 6

శ్లో॥ వాక్యపూర్ణసహనావ్యాయం । భద్రంకర్ణేభిరేవచ
పంచశాంతీః పఠేద్యాదౌ । పఠేద్వాక్యాన్య నంతరం॥ 7

ఓం శాంతిః శాంతిః శాంతిః

## —రారా సద్గురుదేవ నానేరా—

రారా సద్గురుదేవ నా నేరమెంచకుర

1) ఏరినీసరివారు జగతిలో । లేరు లేరనివింటిర ॥ఏరి॥
సారాసార విచారనా । మొరవినరా

2) సారములేనట్టి దీసం । సారజాలము చాలర ॥సా॥
ఘోరా దురితములన్నియు । బారదోలరా ॥రా॥

3) చెప్పరాని బాధలచెనే । తిప్పలాపడుచుంటిర ॥చె॥
అప్పాడిప్పడె యనకనీ । విప్పడెరారా ॥రా॥

4) మాటికి నీనామస్మరణా । నోటజేయుచునుంటిర ॥మా॥
చేటూపాటుల రెంటిని । గోటమీటురా ॥రా॥

5) చొక్కమైన బోధజెప్పి । చిక్కులన్నియు బాపర ॥చొ॥
యెక్కడెక్కడజూచిన । దిక్కులేదురా ॥రా॥

6) ఉన్నదిద్వాదశియులేదని । యన్నషోడశితెలుపర ॥వు॥
విన్నాకన్నాది యన్నాడి । నున్నజేయరా ॥రా॥

7) యోగి వేంకటేశ్వరాయని । అగదాసుడు వేడెర ॥యో॥
ఆగ నిగమాంత బోధను । వేగదెలుపరా ॥రా॥

## —: గేయాలు :—

### 1) కలవరమాయె మదిలో...

1) కృప జూడగ రావా జననీ — ఓ జననీ
రాఘవరెడ్డి రాణివి నీవని నమ్మితి నన్నూ గావమ్మా
నిత్యము నీకూ సేవలు జేసెద
ముక్తికి మార్గము జూపమ్మా ॥కృపజూడగ॥



2) నాలో యేదో పరుగులు పెట్టుచు
బాధలు కొల్పుచు నుందమ్మా
బాధలు మాన్పె బ్రహ్మవు నీవని
మీదరి చేరితి గావమ్మా ॥కృపజూడగ॥

3) మూడీషణముల పాదు తెలియక
మునుగుచు నుంటిని కావమ్మా – మీ
కరుణా యనెటి స్టీమరుపై
నన్నావలిదరికీ జేర్చమ్మా ॥కృజూడగ॥

4) తొమ్మిది తూటుల తోలు బొమ్మయని
తెలియక చేసితి స్నేహంబు
షోడశి భావము యేడలేదనె
జాడ దెలుపుమా – మాయమ్మా ॥కృపజూడగ॥

5) లోకుల మాటల లెక్కగొనక – మీ
చక్కని పాదము మ్రొక్కితినీ
నిక్కము ద్వాదశి భావము లోపల
ఉత్తది జేసిన మాయమ్మా ॥కృపజూడగ॥

6) వాసిగాను తాలూక మెలుగులో
అందగ యుండిన దేవాంబా
నిర్మలానంద నిండు హృదయమున
నిలిచి యుండినా మాయమ్మా ॥కృపజూడగ॥

2) జగమే మాయా బ్రతుకే మాయ...

1) నేనేమాయా నేనే యెరుకా
నేనేనయా యఖిలలోకాలుగా వింతలోకాలుగా ॥నేనే॥

2) ద్వైతా ద్వైతముల భావించీ చూడ
ధ్వనినేనై ధ్వనియించె, శోధించ నేలా



నేనే లేకున్న ఏమున్నదోయి
నేయుంటెనే వింత జగముందునోయ్
ఈ జగముందునోయ్ ॥నేనే॥

3) మేనూ కూటుముకు నేనే కీలకం
పెనుమాయ మునుజేరి నినుజేసె వహాలకం
ఏనో మేనులచే నోయీ దూరం
ఈ జన్మమే నీకు శూన్యమవ్వునోయ్
అపూర్వ మవ్వునోయ్ ॥నేనే॥

4) జడమయ్యె జగమెల్ల దోచే నిస్సారము
షోడశిని గూఢముగ శోధించి చూడు
ద్వాదశి నిగూఢముగ యెరిగుండుమోయ్
శ్రీమన్న గురునిమీరు సేవించుడోయ్
మరి పూజించుడోయ్

8) **అజ్ఞానంబున నేమము విడి...**

1) అజ్ఞానంబున నేమమువిడి పలుబాధలుపడనేలా సోదరా—
దేవమాంబలేదా? వారిని శరణు వేడరాదా—

2) పంచ భూతముల ప్రపంచమని మన
కెంచి చూపునండీ — కర్మలేకుండ జేయునండీ
బాధలిక పాసిపోవునండీ।వారుమన పాలిదైవమండీ ॥అజ్ఞా॥

3) సాంఖ్య తారక మనస్క భావముల
సందు దెల్పునండీ సాధనిక లేనేలేదండీ
భేదమిక కానేకాదండీ । వాదనలు లేనేలేవండీ
వారు మనగురు దేవతలండీ ॥అజ్ఞా॥

4) ముందుగ ద్వాదశి మర్మ ధర్మములు
నందజేయునండీ — తొందర జెందనేలనండీ



భక్తుల కల్పతరువెనండీ । షోడశి నెంచి తెలుపునండీ
పంచదశి కీలుదెల్పునండీ ॥అజ్ఞా॥

5) వాసిగాను శివనగర మందున
స్థాపితమయెనండీ — భక్తానంద గురుదేనండీ
భక్తులు వేగమె రారండీ । జన్మలభీతి మాన్పునండీ
బయలై జన్మకు రారండీ ॥అజ్ఞా॥

6) భక్తానందుల పాదము నమ్మిన
భీమయాఖ్యుడంట — తెలిపిన నిజధర్మమిదండీ
తరచితె ధరపుట్టరు గనుడీ—దైవము కరుణచూడునండీ
ధర్మమునందు నడువరండీ ॥అజ్ఞా॥

4) జననీ శివ కామిని...

1) అమ్మా — బ్రహ్మ రూపిణీ
అమితానందినీ — అచలనామిని ॥అమ్మా॥

2) లేరూ యెవరు మీసరివారు
కారూ వారూ నే ననువారు
మీసరిమీరేనని మిమ్ములనే
నమ్మితినమ్మ — అమ్మా — అలివేణి ॥అమ్మా॥

3) అందూ యిందూ యెందునలేకా
యుందువు తల్లీ నిండువు కాగా
పొందితినమ్మా మిమ్మంతటనూ
అల్లన యేలవే — అమ్మా అలివేణి ॥అమ్మా॥

4) ఆరా రీటితో — అవనియెకల్లని
అయిదులు మూడు — అంతా తీరని
నాల్గు నాల్గులతో నరికీ యెరుకను
వాస్తవ మొసగిన — అమ్మా — అలివేణి ॥అమ్మా॥

5) పిల్లలమట్టి భీమదాసని । ప్రీతితో పిలిచీ భీతినిమాన్పి
ద్వాదశి రూపూ దయచేసిన — ఓ
అమ్మా సుధాత్మక — అహా — అలివేణి ॥అమ్మా॥



5) పిలువకురా అలుగకురా—

1) మానవుడా మరి చూడరా
మానుష జన్మమె మహి మదిరా
మరి మరి రాదు నీ మది గనరా ॥మానవుడా॥

2) నాదను వాదము నిలువదు నిముషం
నేనను అహమూ నీకెమపాశం
యెన్నాళ్ళయినా నిలువది దేహం
దారా పుత్రి ప్రేమాలోన బడిపోయితె మోసం ॥మాన॥

3) బహు జన్మలొందిన కడజన్మలందీ
బహు కర్మలన్నీ బడసియు మల్లీ
తాల్చిన మానవ జన్మమె మనదీ
మేలూకోర చాలూవయ్యి కీలుదెల్యు మూలం ॥మాన॥

4) ఈశనములకు దానుడగాకు
ఆశామోహాని నంటుగ బోకు
అంగడిరా యిది పొంగులు తీకు
పొంగిపోతె దొంగాలారు భంగాపుచ్చు నిన్ను ॥ మాన॥

5) ద్వాదశి భావం దర్శన మెపుడూ
షోడశి నుడుపూ నీపిక బడుపూ
పంచాదశియు దెల్పిన పల్కు
భీమాదాసు గురునీజేరి మారీ కొల్వతెలుసు ॥మాన॥

6) చల్లనిరాజా—ఓ చందమామా—

1) నమ్మితి నిన్నే శ్రీగురుదేవా — నా
కలనైన గనుపించు శ్రీగురుదేవా ॥సద్గురుదేవా॥

2) తొలి దైవముగా మిమ్ము భావించితీ
మనసారగ మిమ్మె పూజించితీ
మొరలాలింపవా పరిపాలింపవా – యీ
దాసుని గాచెడి – వరదుడ రారా ॥నమ్మితి॥

3) ఘోర సంసారమందూనా పడి యుంటిరా
సారె సారెకు మీరలె దిక్కంటిరా
ఆశ లడుగంటగ యీశనలు దీయగా
దాసునెప్పుడు కరుణతొ దయజూడరా ॥నమ్మితి॥

4) ద్వాదశీ భావముల నాకు దయజేయరా
షోడశీభావముల చూపి విడిపించరా
పంచదశి చేతరా భ్రాంతి నొదిలించరా
భవబంధము లన్నియు తొలగించరా ॥నమ్మితి॥

5) ఈ ధరలోన మీసాటి దొరలెవ్వరూ
ఈరేడేడు లోకాల లే రెవ్వరూ
దాస దాసుండరా దోస మెంచకురా
క్షేమయాఖ్యుడ ననుగావు శ్రీ దేవమూంబా ॥నమ్మితి॥

7) అంధుడు నినుగన గలడా–

1) అంధుడు విను గననౌన–గర్వాంధుడు నినుగననౌన
మతముల భ్రమలా మరువ జాలక
సద్గురు సేవలు జేయని వ్యాఘ్రుడు ॥అంధు॥

2) నేను నేననే యహము విడువక బియ్యెమ్మె లెన్ని చదివిన
కుచ్చిత గుణములు కూల్చివేయని ॥అంధు॥

3) సాధు సజ్జనుల సన్మానించక
సర్వ జనులు తా నొకటని తెలియక
సతతము స్త్రీలా సంతతి విడువని ॥అందు॥

4) ద్వాదశి షోడశి ధర్మము తెలియక
పంచదశిని తా నెంచి చూడక
పరిపూర్ణంబని పంతము లాడెటి ॥అందు॥

5) ఎందరెన్ని నిందలు నిను జేసిన
తొందర జెందక అందటి మదిగని
నా పూర్వపు సంచితమని తెలియని ॥అందు॥

6) శృతులు వేదములు పరిశోధించక
తమ గురుబోధను తమచే వినకని
తమకు తెలియదని తర్కము లాడెటి ॥అందు॥

7) ధరలో భక్తానందుని వాక్యము
నిర్మల భీమాయాఖ్యుడు తెల్పగ
పరిశోధింపని పామర జనులీ ॥అందు॥

8) ఎందుకింత కఠినత–నాయందు తోచే–

1) ఎందుకింత కఠినత నాయందు దోచే నమ్మ జననీ
ఏమిసేతు దైవమాయ ఏమి నాకు దోచదాయ
పూర్వపు సంచితకర్మం జేతిరో తెలియనైతి ॥ఎందు॥

2) ఎందరెన్ని మాటలనిన–వెఱువకా మీదరి జేరితి
సందియములు బాపినన్ను సరగున మీదరిజేర్చియు
నిరతము నీదృష్టినుంచి కరుణతో గాపాడుమమ్మా ॥ఎందు॥

3) ఎందుకూ సంసారబాధలు ముందుమార్గము తెలియనైతి
పొందుగా మాభక్త జనులానందము తెలియనైతి
అందుకే యీ కష్టమూల నందజేసినావ తల్లీ ॥ఎందు॥

4) నీదుయాజ్ఞ కారణంబున మేదినీ మూడూళ్ళు తిరిగితి
పోదుగ నాస్థితి కుదురక మోదముజెందక నెచ్చట
తుదకు పాలముపేట వసి ఏదో తమ దయవలన ॥ఎందు॥

5) వాసిగా శివనగరమందూ దాసుల నేలెటి మాతరో
గాసినొందెటి భీమదాసుని ఆశ్రద్రోసెటి న్యాయమేదో
త్రాసభావా దేవమాంబా దోసమెంచకు తోయజాక్షా ॥ఎందు॥

9) ఉదయ ముదయమున లేవండి

1) ఉదయముదయమున లేవండి–గురుజ్ఞానదిలో మునుగండీ
ఒద్దికతో గురుచరణంబులకు శ్రద్ధగ సేవలుచేయండీ ॥ఉద॥

2) అజ్ఞానంబనె యహంకారమును గురుపాదంబుల విడువండీ
సుజ్ఞానంబనె శ్రీగురువాక్యము చిత్తములోధ్యానించండీ ॥ఉద॥

3) గట్టిగాను మూడీశనంబులను పట్టుపట్టి యిక విడువండీ
గుట్టుదేశికునోట దెలుసుక గట్టిగాను ధ్యానించండీ ॥ఉద॥

4) ద్వాదశి షోడశద్వయ మంత్రంబుల పరిశోధనలా తెలియండీ
కలలోదోచిన శరీరమెంతో అంతేయని మది నమ్మండీ ॥ఉద॥

5) అష్టమదంబుల ననచే కొలకై మద్గురు పూజలు శాయండీ
మల్లెలుమొల్లెలు మంచిసుగంధము అక్షంతలు నర్పించండీ ॥ఉద॥

6) షోడశార్చనల వేడుకతోడుత సూరిజనుల పూజించండీ
నీటిలోదాచిన యుప్పమూటయని ధూపదీపములు నివ్వండీ ॥ఉద॥

7) స్త్రీలుపురుషులు స్థితిలోనుండియు మహనైవేద్యం నివ్వండీ
మాన్యురాలు ఈ దేవమాంబకు మంగళహారతులివ్వండీ ॥ఉద॥

8) నిర్మలానంద భీమయాఖ్యుడు ధర్మపద్ధతిని దాటించూ
తత్తరపడకను చిత్తము లోపల ఉత్తములై ధ్యానించండీ ॥ఉద॥

## 10) దయరాదా జననీ...

1) దయరాదా జననీ – నాపై దయలేదా జననీ
సేయరాని పాపములు – నే నెఱుగక
వేయి జేసితిని – బాయగ జేయుము ॥దయ॥

2) ఘోరమైన సంసారంబున బడి
దారి దొరుకకా తల్లడ మందితి
వేరు యనక యీ దీనుని మొర విని
జేరదీసి రక్షించను నాపై ॥దయ॥

3) చావైనను పెండిలియైనను – సరి
జనులందఱు వల దనినను పోనీ
దేవ మీదు చరణంబులు వీడక
సేవింతును మది బాయక నిరతము ॥దయ॥

4) స్థిరమైనది పూర్వత్వంబని – అ
స్థిర మెరుకనియును దెలిసినట్టి శ్రీ
ధరపాపయ పల్లెలో నివసించిన
వరదేవాంబా కరుణతో గావగ ॥దయ॥

5) వాసికెక్క నీ పాలంపేట వాసుండగు యీ పిల్లలమఱ్ఱి
దాస భీమయను బోధివు మనుచు – నే
దోసి లొగ్గితిని దూరము చేయకు ॥దయ॥

## 11) హరిగురో యని యాత్మతోడుత...

1) హరి గురోయని యాత్మతోడుత
స్మరణ చేయుము సోదరుడ
కుచ్ఛిత గుణములు గూల్చివేసి – నిజ
దారి తెల్యుముర పామరుడ ॥హరిగు॥

2) ఎందుకురా యధి కాశలలోబడి
యమలోకంబున కేగకురా
సద్గురు మూర్తికి సేవలు జేసియు
సత్యము దెల్యుచు నుండుమురా ॥హరిగు॥

3) మానవ జన్మము మరల రాదు – యిక
మంచి గురుని యాచించుమురా – నీ
కొంచెపు బుద్ధియు దూరము నుంచియు
పంచిజాగముల ద్రుంచుమురా ॥హరిగు॥

4) భార్య పిల్లల భ్రాంతికి లోబడి
భంగము గాకుము సోదరుడా
స త్సాంగత్యమె స్వర్గలోక మని
సతతము భజనలు చేయుమురా ॥హరిగు॥

5) ఉత్తమ పురుషుల స్నేహము జేసితె
చిత్తము విలుచును నిజమిదిర
తగు నటురా నీ గురు పూజలనూ
మరచుట నీ కే నాశమురా ॥హరిగు॥

6) ద్వాదశి షోడశి భావము దెల్సియు
బ్రిహ్మతో ఐక్యము గావలెరా
పంచదశితో దృష్టాంతము దెల్సియు
సద్గురు పదముల వాల్రిలుమురా ॥హరిగు॥

7) భక్తానంద దేవమాంబ గురు భాగ్యము గల్గితె చాలునురా
నిర్మలానంద భీమునితత్వము నిలిచిచూచితె చాలునురా ॥హరిగు॥

## 12) ఉన్నదీ నరకంబున్నదీ...

1) ఉన్నదీ నరకంబున్నదీ సద్గురుని జేరమి ఉన్నదీ నరకంబున్నదీ
ఉన్న భక్తుల కన్న నాకిక పన్నుగా బహు తెలిసినాదని
చెన్నుమీరగ పెద్దలాను చిన్నతనము జేయువారికి ॥ఉన్నదీ॥

2) పెద్దలా గను గొన్న వెంటనె
ప్రేమతోడుత పిలిచి నట్టుగ
పిలిచి మనసులో నొకటి నుంచుక
పైకి నాటకమాడు వారికి ॥ఉన్నదీ॥

3) ఆది అంత్యము తెలియ జాలక
అసలు పూర్ణము తెలియ జాలక
నీకు తెలియ దటంచు భక్తుల
నిందలా పాల్చేయు వారికి ॥ఉన్నదీ॥

4) ఇంట్ల కులసతి యేడ్చుచుండగ
ఒంట్లె రక్తం బెక్కు వుందని
చక్కనీ పరస్త్రీల తల్లని - యనక
గంతూలాడే వారికి ॥ఉన్నదీ॥

5) పాలు పెరుగూ అన్నమూతో
బాస జేసిన భార్యనూ విడి
మురికి తోలూ కాశపడి చెడు -
హీన జాతిని కూడు వానికి ॥ఉన్నదీ॥

6) ద్వాదశీ షోడశుల యొక్క
ధర్మమేమో తెలిసి నిజముగ
పంచ దశితో కూడి నీవారూఢ
స్థితినీ పొందకుంతే ॥ఉన్నదీ॥

7) ఉరికి యురికి నడచు చుండగ
రాయిదాకి బోర్లపడితే
ఊరు నాకయిరాదు యనుచూ
నగరివాసుల తిట్టు వాకి ॥ఉన్నదీ॥

8) కర్మ జాలక రోగమొసె
ధర్మ దూరుడనైతి ననక
బోధ నాకయి రాదటంచును
బాధ నొందే భ్రిష్టులాకు ॥ఉన్నదీ॥

9) ఉన్నదీ సత్యంబు యిది యని
అన్న దానిని దెలయలేక
పన్నుగా భీమన్న మాటల
చెన్ను మీరిన చెంచెలులకు ॥ఉన్నదీ॥

13) నమ్మి గొలిచేతేనూ నాశనము లేదుగా...

1) నమ్మి గొలిచేతెనూ నాశనము లేదుగా ఎట్టులైనా
తిరిగిరాని స్థానము జేరుమన్నా—

2) నరకమోక్షంబు లనియేటి రెండు
గురుని జేరుంటెనంటావు నమ్మూ – మన
శిరమూ మీద గురుని కరము పెడుతె యెట్టులైనా
తిరిగిరాని స్థానము జేరుమన్నా ॥నమ్మిగొ॥

3) అష్టమదమూలా తెగ గోసేదుంటె
స్పష్టముగ వర్గముల నరికేదుంటే
గురుని కరుణాచేత బంధములు పోయితేయెట్టులైనా
తిరిగి రానీ స్థానము జేరుమన్నా ॥నమ్మిగొ॥

4) ఇలలోకుమ్మారి పురుగెట్లు తిరుగూ
నల్లె గుర్రెరిగీ నడిచుంటే నరుడూ



తిరిగి పుట్టాబోడూ దేవమాంబా న్యాయం బెట్టులైనా
తిరిగిరాని స్థానము పోదువన్నా ॥నమ్మిగో॥

5) తామరాకూపై జలమంటునట్లూ
తనువు సిను విడిచీ పోవూనూ అట్లూ
గనుక గురునీ నమ్మి మరుగు తెలిసేదుట్టె యెట్టులైనా
తిరిగిరానీ స్థానము పోదువన్నా ॥నమ్మిగో॥

6) పదియు రెండక్షరములాను బాగా
పట్టి పరిశోధించియు మనసుబెట్టి
పదియు యారింటినీ పూని వదులేదుంటే యెట్టులైనా
తిరిగిరానీ స్థానము జేరేవన్నా ॥నమ్మిగో॥

7) భీమదాసు నేలిన దేవమాంబ
నేమమున గొల్చినట్టి సుజనులా
బట్టబయలందునా గట్టిగను చేర్చురా యెట్టులైనా
తిరిగిరానీ స్థానము పోదువన్నా ॥నమ్మిగో॥

**14) వినరయ్యా యీా అచలాబోధ విన్నాపంబూ...**

1) వినరయ్యా యీా అచలాబోధ విన్నాపంబూ
గనరయ్యా పరిపూర్ణా బోధా అనుభావంబూ ॥వినర॥

2) నా... మమతాలేమియు లేనీది అంతటూ నిండున్నదీ
దీనికి సాటిలేవేదీ వాదాభేదము లేనిది ॥వినర॥

3) చూపుకు వశముగానిదీ అపోజ్యోతీ కానిదీ
అందారికి అందనిదీ అంతు తెలియుగరానిదీ ॥వినర॥

4) పంచాముద్రలు లెని దీ పండూ వెన్నల గానిదీ
చిత్కల భావముకాదిదీ రేచకపూరములేనిదీ ॥వినర॥



5) నామారూపము లేనిదీ నేమించీయనరానిదీ
కామాంధాకారూలకు కఠినమైన చోటిదీ ॥వినర॥

6) పరిపూర్ణా మొకటీ చూచుకో—అని యేటియెరుకను తెల్సుకో
ఈ రెంటికర్థము తెల్పినా ఆ గురుడే పరమని నమ్ముకో ॥వినర॥

7) ధరలో శివనగరంబులో దేవాంబాగురిని వేడగా
పరమా పదవికి బాటనూ పి. భీమయ్యాకు జూపెను ॥వినర॥

## 15) అదిగో చూడరా అచలబ్రహ్మమూ...

1) అదిగో చూడరా అచల బ్రహ్మమూ
అదిగదిగో చూడరా అచలా పూర్ణమూ
సత్తుచిత్తు యుందేమిలేకను మొత్తమయ్యి నలుదిక్కులున్నదీ ॥అది॥

2) చూచే చూపుల కందకున్నదీ — అది
చెప్పాదామన్న నోరాడాది
గొప్ప కులచేందేమి లేకను చెప్పనమన్నను చప్పుడుగా నిది ॥అది॥

3) వింతాలేమియూలేని బ్రహ్మము — అది
మధ్యాంత రంగములో నిండున్నదీ
సంతసము నగురుసేవలు చేసితె చక్కనీపరమూ నిక్కముగనరా॥అది॥

4) నూటమొన మోప సందులేనిదీ — అది
గురు కీలూ దెలిసితె మేన్నదీ
వాదమేలరా వదురబోతయుక సాధనకవ్వలి బోధనుతెల్సుకో ॥అది॥

5) లక్షణంబుక జూడరోరి — నీ
పక్షపాతంబు విడువరోరి
అక్షయంబుగ పిల్లలమఱ్ఱి భీమయాఖ్యుడ కక్షలు మానెర ॥అది॥

## 16) ఆ. కా. మూ వై...

1) ఆ.కా మూ.వై. పూర్ణాపూజా తోచీ లేకాచేశాను
సాకారంబున సద్గురుమూర్తిని సర్వంబని పూజించాను ॥ఆ.కా॥

2) ద్వాదశిని మదీచూచీనంక – షోడశీలేదన్నానూ
పంచాదశినీ జూచీనంక ప్రత్యక్షము నాకన్నాను ॥అ.కా॥

3) అందుకని యీ లోకామంతా నాటకంబని అన్నాను
ఎండామావుల రీతీగాను ఉండే జగమంతన్నాను ॥అ కా॥

4) ఆడూగారడి వానియాట యంచూ మదిలో నెంచాను
యెంచీ నా మదిలోనా గురుని ఆత్మలో భజియించానూ ॥అ.కా॥

5) ఖండీతముగ అండపిండ బ్రహ్మాండాములు లేవన్నాను యీ
గుట్టుదెలిసిన వారలె భువిలో గురుపుత్రులు యనియన్నాను ॥అ.కా॥

6) చిట్టా చివరకు పుల్లెక్కంబని గట్టీగా నే నన్నాను
అన్నదివిన్నది సున్నని చెప్పి విన్న నె గురునిచెవిన్నాను ॥అ కా॥

7) కన్నా వారికి తెలిసిన వారికి యెరుకాలేదని యన్నాను
సమరూవత్తీ కాచీనంక సాక్షియే లేద న్నాను ॥అ.కా॥

8) కరుణాతో శ్రీ దేవామాంబా – తెలిపినట్టి పాఠాలూ
అప్పగించే భీమాదాను గొప్పతనమన బోకండీ ॥అ.కా॥

భక్తానంద స్వాములవారి ప్రియశిష్యుడు

## శ్రీ వేర్గు నారాయణ (హిందీ పండిత్)గారి

## విరచితము

17) కన్నయ్యా నల్లని కన్నయ్యా ...

1) అమ్మమ్మ – మమ్ముల బ్రోవమ్మ
మిమ్మె శరణంటి మన్నించుమా
కనికారించవా కర్మ దొలిగించవా
కడు దీనుండ కాపాడవా ॥అమ్మమ్మ॥



2) నేనన్న విధమేమొ యెరిగించవా
నేను – మేనుల విడదీసి చూపించవా
పెనుమాయ మును బాయ ననుజేయవా
నను – విడదీసి మీ లోకమున జేర్చవూ ॥అమ్మమ్మ॥

3) నీ దండి కృపలేమి – ఎవడయినను
మొండి జగమందు తపియించు దౌర్భాగ్యుడు
అనుమాత్రమే నీదు కృపజాలును – బహు
పాపాత్ములై నా–సరి తరియింతురు ॥అమ్మమ్మ॥

4) పరమాత్మ రూపిణివి నీవంచును – మది
పరికించ లేరైరి పతితాత్ములూ
నిరతంబు నీసేవ, మహాభాగ్యము – అన
వరతమబ్బు పుణ్యాత్మ డనిమేశుడు ॥అమ్మమ్మ॥

5) శివనగర్ పురమందు నెలకొన్నవూ–శ్రీ
శివరామ దీక్షితమై వెలిగున్నవూ
దేవాంబ యను పేర దివ్యంబవూ
గావు నారాయణుని వేగ కరుణాలంబవు ॥అమ్మమ్మ॥

18) పగలే వెన్నెలా జగమే...

1) గురుదరి జేరరా శరణని వేడరా
తిరిగీ – భువి జన్మరాదు తెల్యరా ॥గురు॥

2) పుత్ర పాత్ర ప్రేమయనె పాత్ర నెరుగరా
చిత్రమైన రూపంబిది మట్టి పాత్రరా
నిలువది చూడరా – పగులును. ఈధరా
జరుగుచున్న – యీ సత్యమ్మెరుగమేమిరా ॥గురు॥



3) కామముతో చేయి కలిపి – పశువు కాకురా
నేమముతో నున్న నీకు కలుగు శుభమురా
మాయకు దాసువై మరువకు సోదరా
మరుతువేని హీనజన్మ మరల గల్గురా ||గురు||

4) గురుడనె రెండక్షరముల గుర్తుదెలియరా
శరణవినా తిరిగి జన్మ చేరనీదురా
ద్వాదశి మంత్రమూ దండిది చూడరా
వేదసార సంగ్రహమంచు పాదు దెలియరా ||గురు||

5) తాను చచ్చు మంత్రమేదొ తరచి చూడరా
పూని తరచి చూడ షోడశాక్షరింతెరా
కలవలె నుండునని తెల్పె మాతరా
ఇలలో గురుని జేరిచూడు నిజమురా ||గురు||

6) తారకమును తెలిసి నీవు శాంతినొందురా
ఊరకనే తిరిగి – ఆడి భ్రాంతి పడకురా
శివనగరంబునా – శివ రామాత్మరా
దీనుడు నారాయణుడను నేలు దేవమా ||గురు||

19) బ్రహ్మంతాత చెప్పింది నిత్యం జరిగే సత్యం...

1) భక్తానంద–ఓ దేవ బంధము జన్మకు తెంచావా
బంధీగున్న భక్తుల కెల్ల బంధం తెంచ్చా వచ్చావా

2) రాయి రప్ప లిల మాయ రూపమని
మాటి మాటి కన్నావూ
పై రంగు పూత లన్నావూ – హోమ్
తీర్థ యాత్రలు తిరిగిన ఫలితం
అప్పుల బాధే నన్నావూ ||బ్రహ్మం||

3) ముక్తికోసమయి రేయింబవళ్లు
తపస్సు లే లన్నావూ
అట ముక్తి మాటలేదన్నావూ — హోమ్
ముక్తి రూప మవ్యక్తము దానిని
యుక్తితో పొందూ మన్నావూ ॥బ్రిహ్మం॥

4) యజ్ఞ యాగములు చేసిన వారికి
మోక్షా లన్నారానాడు
పశు బలుల నిచ్చి రానాడు — హోమ్
జీవహింసలూ — పాప కర్మములు
బహ్మ ప్రాప్తికే నన్నావూ ॥బ్రహ్మం॥

5) దాన ధర్మములు చేసిన వారల
దండి వారలన్నారు — అహ
నిండు ప్రాణులన్నారు — హోమ్
ఎన్ని ధర్మములు జేసిన గాని
మళ్ళి జన్మకే నన్నారూ ॥బ్రిహ్మం॥

6) లేదు లేదు యమనస్కా తారకము
క్లేశము నొందును దేహం
లవలేశముండదీ దేహం — హేమ్
ప్రత్యగాత్మలో — పరరూపము గన
బట్టబయలు గమ్మాన్నావూ ॥బ్రిహ్మం॥

7) దేవ దేవ శివనగర్ వాస
పుర జనుల భాగ్యమె కాదా
మిము పొందిల బాసిరి బాధ — అహ
దేవమాంబ సిదాసుడు నారయ
నాత్మలో తలచెను వేగా ॥బ్రహ్మం॥

20) జ్యోత్ - సె - జ్యోత్ - జగాతే - చలో -

1) ఆడుతు పాడుతు శ్రీ గురునీ
భజియింతునోయీ భయము విడీ

2) బంధూ ప్రేమామోదము మరిచి
సుందరి కామానందము విడిచి – దేవా
దేవా దేవని శ్రీ గురునీ
భజియింతునోయీ భయము విడి
భక్తానంద గురునీ నిత్యానంద వరునీ ॥ఆడు తు॥

3) గురువే కాదని తరిమిననూ
గెలిచెదనూ భక్తి మీరగనూ
దాశరథీ దయ మాలిననూ
హనుమాన్ గెలిచెను భక్తితోనూ – భక్తా
భక్తాలోలుడు శ్రీగురునీ భజియించునోయీ
భయము విడీ
భక్తానంద గురునీ నిత్యానంద వరునీ ॥ఆడుతు॥

4) గురు రూపమునే యెంచి కబీరూ
నిర్గుణ బ్రహ్మను చాటె సుధీర !
కృష్ణాఖ్యమునే కోరిన – మీర
సూక్ష్మార్థముగా నెంచె నిరూప – దాసూ
దాసు నారయ – తా గురునీ
భజియించెనోయీ భక్తితోనూ
భక్తానందా గురునీ నిత్యానంద వరూనీ ॥ఆడుతు॥

శ్రీ భక్తానంద స్వాముల వారి ప్రియశిష్యుడు

## శ్రీ పిల్లలమఱ్ఱి చంద్రమౌళిగారి రచన

21) రఘుకుల తిలకా శ్రీరామానను...

1) నంద సునందా శ్రీ భక్తనంద నను గావుము ॥

ఎందుకమ్మ క్రోధము నీయందు నన్ను జేర్చుమమ్మ
పొందుగ మీ సేవ నాదు డెందమందు చేతునమ్మ ॥నంద॥

2) నిర్గుణమాతా నిను జేరితి నను గావుమమ్మ ॥
అందమైన ద్వాదశి లోచందమేమొ తెలుపవమ్మ
మందత్వము మాన్పితల్లి ముందుగ పరబయలు దెల్పు ॥నంద॥

3) మూర్ఖుడనైతి నామూల మేదొ తెల్యనైతి ॥
అధముల సాంగత్యమందు సదమల బోధ్యరనైతి
ముదమెంప్పగ యెరుక మరుపు వహాలము దయచేయుమమ్మ॥నంద॥

4) అంచితముగనూ అపంచ దశిని నరయనైతి ॥
చంచలాత్ములైన పరుల పంచన జేరితిని తల్లి
ఎంచి చూడగా ప్రపంచమంత చలనరూపెతల్లి ॥నంద॥

5) చంద్రమౌళినీ యీ యింద్రజాల మేలనమ్మ ॥
సాంద్రమైన పూర్ణబోధ దేశికేంద్రు తెల్పుమమ్మ
తూడివంశ చంద్రమాతృ శ్రీదేవి దయితవల్లి ॥నంద॥

శ్రీ నిర్మలానంద భీమయాఖ్యులవారి ప్రియశిష్యులు

## శ్రీ దుద్దుకూరి రామమూర్తిగారి స్వీకృతము

22) చరణములే నమ్మితీ సద్గురుదేవా...

1) చరణములే నమ్మితీ సద్గురు దేవా చరణములే నమ్మితీ
చరణమునమ్మి మీ పదములే గొల్చితి
ఫలితాము లేనట్టి పనులాను విడనాడి ॥చరణ॥

2) దరిజేర్చి కడతేర్చు ధాతలెవ్వరు స్వామి
దొరవానినమ్మితీ దురిత జాలము బాపు ॥చరణ॥

3) పరమార్థమయినట్టి పరబ్రహ్మమును జూపి
పనికిమాలిన యెరుకన్ పారద్రోలుము స్వామి ॥చరణ॥

4) ధరణి పాలంపేట దండి ప్రభువులు మీరు
దరిజేరు భక్తులను దరికి జేర్చేటి స్వామి ॥చరణ॥

5) నారాయణా పురమూ నందూవ దుద్దుకూరి
రామమూర్తిని గావరమ్ము భీమాస్వామి ।చరణ।

# అచల ప్రబోధము

శ్రీ శివరామ దీక్షితులవారి అచల సిద్ధాంతమువలన మానవునికి నిశ్చల భావము ప్రధాన మను అంశమునకే యెక్కుడు ప్రాధాన్య మివ్వబడినది. చంచల స్వభావమున యేకార్యము సుసంపన్నము కాదు గనుక ఇహపర సుఖ సంపన్నధామమునకు ధైర్యస్థైర్యములు సోపాన పంక్తులు మానవుడు బ్రహ్మా నంద భరిత సౌఖ్యసీమకు చేరవలెనన్న శాంతి తద్వార చలనరహిత విధా నము విదిగా అభ్యసింపవలసిన అగత్య మెంతైన అవసరము,

ఈ అచల భావమును ఏతత్సీఠ ప్రబోధకాచార్యులు చక్కని పంథాలో బోధించి సిద్ధాంతరహిత సిద్ధాంతమును స్థాపించిరి. ఉత్తరోత్తరవారి మార్గాను వర్తుండనగు నేను తద్భావమును ఏతత్ గ్రంధమున పాటలు పద్యముల రూప మున కొంత ప్రకటపరచి. తనవితీరని దెబ్బమున గద్యమయయుగమని పేరు గాంచిన యీ కాలమున కొంత వచనము వ్రాయుట అవసరమని భావించి యీ ప్రయత్నమునకు కడంగితిని

# అచలభావము

అచలమను సిద్ధాంత నిర్వచనము మన యీ ప్రాచీన గ్రంధరాజములందు వెదకిన కోకొల్లలు, ప్రస్తుతము ఏతత్పీఠ లక్ష్య లక్షణ సమన్వయమున ఉద్దండుడని పేరుగాంచిన అఖండుడు భాగవత శ్రీకృష్ణుని కందార్థోక్తంబయిన పర్యాయ అచలనామముల నుదహరించి తదనంతరము తల్లక్షణ సమన్వయనము నకు ప్రయత్నింతము. "పరమపద మనిన బయలన గురుగుహ్య మనంత మనిన గోప్యంబనినన్ పరిపూర్ణ మచలమనినను తిరమనగా బట్టబయలు దెలియూమాయప్పా" ఇంకా "ఎరుకా నెరిగినదన్న యెరుకా మీరిన దన్నా యెరుకా మరుపులులేని పరవస్తు వన బయలె తెలియూ మాయప్పా" అని ఇట్లీ ప్రకారముగా పేర్కొనబడిన అచలము క్రియాశూన్యమని చెప్పుటకు యీ

పద్యము ఉపకరించును చూడుడు "సామర్థ్యమేమి జూపదు. కామ క్రోధాదిక ములం కలయ దవిమిశమే బాము లెరుంగదు యితరులు యేమనినను మారు పల్కదీ బట్టబయలూ'' దీని స్థితిగతులు చెప్పి చూపుటకు సాధ్యముగాదని మరొక పద్యము శ్రీ కృష్ణోక్తమయిన దానిని తిలకింతము. "పలుకున పలుకగ రాకను తలపోయుద మనిన మదికి తిగులక యెపుడున్ ములగృచ్చ సందు లేకను కలిగున్నదని' ఈ హానీటయిన భావమును సూటిగా చెప్పటకు ఓపైన పద ములు వాడి కవి భావస్ఫూర్తిని కల్గించెను. ఇదే విధముగ అర్థగౌరవమునకు శక్తివంచనలేని సోపరకమయిన ప్రియత్నము శ్రీకృష్ణుడు సిద్ధహస్తుడు. ఈయనకు లోకానుభవము యెక్కుడు. చమత్కార వంతమయిన కవిత చెప్పటలో బహునేర్పరి చూడండి పైన పేర్కొనబడిన ఉమేవిజ్ఞానాతీత మయిన భావమును "ఇదిగో చూడు కదులాదోయన్నా' అని పట్టి చూపుచు న్నాడా అనునట్లు చెప్పుచున్నాడు లౌకిక అలౌకిక భోగవాంఛాతీతమయిన అనుభవమును అచ్చ తెనుగున బోధించ ప్రియత్నించిన వారిలో శివరాముని తరువాత భాగవత కృష్ణుడని చెప్పుటలో సంధియ మెంతమాత్రము లేదు. "అపరోక్షమయిన మనుజునకు పరోక్షంబగునె బయలు గురుకృపలేకన్'' అని గురుకృపాలబ్ధితకు ప్రాధాన్యమిచ్చి వారికి సేవలు చేసి తత్కృపకు పాత్రులు కమ్మని అట్టివారికి యీ అచలభావము కరతలామలకమగునని గురువు లేకుండ విద్య నభ్యసించ ప్రయత్నం చేసేవారలకు హెచ్చరిక చేస్తున్నాడు. ఈ క్రింద చూడండి."గురుమూర్తి చూపకున్నను పరిపూర్ణంబెట్లు తనకు ప్రత్యక్షంబగున్' అచలభావానురక్తతకు తత్సిద్ధి వడయుటకు భావశబలత పనికిరాదని విశ్వాత అవసరమని తన కావ్య సంపుటిలో యెన్నోమార్లు నొక్కి వక్కాణించినాడు. అనుభవాతీతమయిన అచలము. "పలుకన్నా పలుకాక తపన్నాదెరుగాక చలి యెండా వానల నలయాక విలుచుండూగదరా మాయన్నా" అని యిట్లెన్నియో విధముల రకరకాల ఉపమాన ఉపమేయముల ద్వార సెలవిచ్చి యున్నారు. తన గ్రంధమున ఒక్కొక్కసారి భావపునరుక్తము యేర్పడి చర్వితచర్వణమై రసాభాస మగుచున్నదను విమర్శకు జవాబుగా తన విజ్ఞాపనలో ఇట్లు పేర్కొ న్నాడు. కొంచాపు నదిలో తంచూ యెంచి విస్తీర్ణ పరచినచో దాని గాంభీర్యము నకు జంక పనిలేకుండ ఉండుటకయి తానీగ్రంధమును పెంచితినన్నాడు.

'ఇంతింతని యనరానిది వింతలు చేయునది యెన్ని విధముల గవిన్ చింత లెరుంగని దీ బయలు'' అని చెప్పి అచింత్యమయిన భావమునొందుమని ప్రబోధము చేయుచున్నాడు. శివరామ దీక్షితులు తన గ్రంధములయందు యెక్కడ చూసిన పరిపూర్ణమేమి గానిదని అది యేమిలేనిదని అది అందటికందనిదని పదే పదే చెప్పుటలోని అంతరార్థము, ప్రతి ఒక్కరు అట్లు నమ్మను మనియే. అట్లుగాని నాడు మనకు మిగతా మతముల వారికి తేడాయేమియు యుండదని అట్లుకాని నాడు మన ప్రత్యేక అభ్యుదయ వాదమునకు ఫలితమే లేకుండ పోవునని అడుగడుగునా హెచ్చరికలు చేసి యున్నాడు. పరిపూర్ణమును గూర్చి కృష్ణు డిట్లనుచున్నాడు. "తండోప తండములుగా దండిరుషాదికములు తనలోపల నుద్ధండత నుండిన పోయిన నిందు సముద్రంబు యెరుగకుండా నెప్పటికీ పరిపూర్ణామిట్లుండూ'' నెప్పటికీ అని యిట్లు సర్వసామాన్యుల కందుబాటులో నుండు ఉపమానము లెన్నియో చెప్పి శివరాముల అభిప్రాయమునకు వన్నెలు దిద్ది అచల భావమును దిగ్గంతములకు వ్యాపింప చేసినాడు. ఈ అచలభావము సిద్ధించుటకు గురు కృప అవసరమని అట్టి కృప పొందుటకు యెన్నియో మార్గములు కల్గియున్నప్పటికినీ సేవాపద్ధతి సర్వశ్రేష్ఠమయి సర్వులకు సులభసాధ్యమయి యున్నందున అట్టి సేవావిధానమునకు ప్రాధాన్యమిచ్చి అచ్చటచ్చట గురు శిష్యుల మధ్యన అన్యోన్యానురాగము పరిపుష్టి చెందుటకు శుశ్రూషణలు మాత్రమే ప్రధాన కారణములుగా చెప్పబడినవి. అట్టివి యిట కొంత తిలకించి శుశ్రూషణ గౌరవమును తత్ఫలసిద్ధిని ఆస్వాదింతము.

# గురు శుశ్రూషలు

నాలుగు శుశ్రూషణములు లోలత గావించుకొనుచు లోకాతీతంబాలోకించుము అని కృష్ణునన్న అభిప్రాయము మానసిక సంబంధమయినదని తరువాత కొందరు విమర్శకులు అభిప్రాయబడ్డారు. అట్లని బాహ్యోపకరణములు కూడదని కాదు (లోలత అనగా ప్రేమతో) 1) ఆత్మశుశ్రూష 2) అంగశుశ్రూష 3) స్థానశుశ్రూష 4) పద్భావ శుశ్రూష యని పేర్కొని వారి

వారి భావానుకూలముగా నిర్వచనము తెల్పిరి. అందులో కొన్ని శ్లాఘింపదగినవయినా కొన్ని అశ్లీలములయి విమర్శకుల వ్యాఖ్యానములో మిగులని గొంవములు గలవి యయి పోయినవి. కొంత దీర్ఘముగా ఆలోచించిన తర్వాత ఈ శుశ్రూషలకిట్లు నిర్వచనము చెప్పిన బాగుండునని తలంచి సందర్భాను సారముగా ఒండు రెండు స్థలములలో పెద్దల అభిప్రాయమ్మును చూపించితిని.

1 ఆత్మశుశ్రూష:— ఇది అంతఃకరణ సంబంధమయినది, యిందు మనుజునకు వేదాన్త శ్రవణాది క్రియలతో పాటు యిష్టదేవతా సంప్రార్థనా విధానము అత్యంతావశ్యకముగా చెప్పబడినది. అచలుడు తనకుపదేశము నిచ్చిన గురు సార్వభౌముని పద పంకజములు చిత్తమున నిల్పి తన్నామము జపించుట సిద్ధాంతముగా శాసించబడినది. అట్టి తరుణమున మానవుడు చిత్త శాంతిని పొంది గురుచే చెప్పబడిన భావము సంగాహనము చేయుటకు వీలగును లేని వాడు గుసగుస మంత్రముకు గురువు చెడెను. గురిగిలో దూపాయకు శిష్యుడు చెడెను అను సామెతకు తార్కాణ మగుదురు. తరువాత రెండవది

2 అంగశుశ్రూష:— ఉపదేశకుడయిన తన గురువు ఆత్మసౌధమున సదా ప్రత్యక్షమలు నిత్యానందము గల్గించి ఆత్మసౌందర్యమును కల్గించినప్పటికిని ఋతు కాలము లందు గురు సందర్శము లభించినప్పుడు తన కది కాల పరిపాకముగా భావించి వెంటనే సమల్లోపమున దరిజేరి మనసార యూగుచు భాహ్యేవయువ సందర్శనము చేసికొని పునీతుడవు కమ్మని చెప్పుటచే యీ రెండవ శుశ్రూశ అద్వితీయమైన గౌరవ ప్రశస్తిని పొందినది. ఇందుకొక ఉదాహరణములను గ్రహింతము. "సాధూనాం దర్శనం పుణ్యం స్పర్శనం పాప నాశనం సంభాషణం సర్వ తీర్థాని వందనము మోక్ష సాధనం" కనుక అనాది నిర్వికల్ప నిరంజనుడగు యీ విశ్వల పరాత్పరుని దివ్యలీలావతారమును మహా మహాని దర్శనము నీవు పురాజన్మ కృతపుణ్యఫల విశేషముగా భావించుకొని జాతీయ పండుగల వాటివలె మిక్కిలి శ్రద్ధాసక్తులు గల్గి వ్యవహరింప గోరెదను. తరువాత మూడవది.

3 స్థాణుశుశ్రూష:— సర్వ సాధారణముగా ఉపదేశములు ఏవోకొన్ని

ఆశ్రమాలల్లో లేదా దేవాలయాలల్లనో తరచుగా జరుగుచుండును. ఇందుకు యెన్నో కారణములు గలవు అందు ముఖ్యముగా ధనాభావము పెద్దల వలన భయము విదేశీయమైన మన నవ నాగరికుల పరిహాసము వలన భయమువలన ఇట్లు జరుగుచుండును సాహసవంతుడయిన సాధకుడు తన వలె తన దేశము తన ప్రాంతము తన గ్రామము తన గృహము పుణీతము గావలయునన్న ఆతురతతో తన నెలవునకు గురువును ఆహ్వానించి సుస్వాగతముతో పాటు ఉచితాసన పాన భోజనాదులను శుభ్ర వస్త్ర పరిధానాదులను సమర్పించి యథోచిత సత్కార విశేషములు జరిపించును అట్లు జేసిన వాడు ఆ శిష్యుని భాగ్యమింత యంత యని పొగడంగ శక్యముగానిది ఇక నాల్గవ శుశ్రూష

# 4. సద్భావ శుశ్రూష

గురువుయందు ఆతని బోధనలయందు ఆతని నడతయందు ఇతర ఆతని సంబంధమయిన పసువాహనాది ఐశ్వర్య భోగములందు మంచి భావము గల్గి యుండుట.

ఈనాడు గురుశిష్యుల మధ్యన యీ భావము పూర్తిగా లోపించి ముఖ స్తుతి మాత్రమే మిగిలి పరస్పర వైషమ్యములకు కారణమయినది. మానవ మాతృడయిన గురువు మనకు బోధించునదేమి యను నైరాశ్యభావన మేపడి జాతి మరీ హీనస్థితికి దిగజారి పోయినది. సహృద్భావ పునరుజ్జీవమునకు ఈ సద్భావన యను శుశ్రూష యెంతో ఉపకరించును. గురుకార్య నిర్వహణలో శిష్యుని కర్తవ్యమును గూర్చి బోధించుచు ఒక పౌరాణిక గాథను ప్రామాణిక ముగా చెప్పుచున్నాడు చూడుడు "గురుని కపరాధి యగు నా నంవాధుని ద్రుపదునొంచు నరుని విధమునన్ ధర శిష్యవరుడు తన గురుశత్రుని చేత నైతె కొనివ్వనదగున్" కొందరనవచ్చును, అందఱు అర్జునిని వంటి వీర వరేణ్యులందురా యని. అవును నిజమే. సహృదయుడయిన శిష్యుడు ప్రతాప వంతుడు గానిచో యిట్లు ప్రవర్తించవలయునని మరొక ఐతిహాసికమును చూపు చున్నాడు తిలకించుడు "త్ర్యక్షుని నిందించిన యా దక్షుని గని ప్రాణమిడిన త్ర్యక్షసతివలెనా యాక్షితి తన దేశికుని నుపేక్షించిన జనుల తానుపేక్ష

దగున్" తండ్రియైన సరె యెదిరించి సతీదేవి తన భర్తయగు పాలాక్షుని విందించి తన పతివ్రతాధర్మమును అజరామరముగ గావించుకొనిన సతీదేవి. ఈనాటి శిష్యులకు ఆదర్శము కావలయును. గురు అవతార వర్ణనాదులను శిష్యుడు నమ్మి తనకు గల ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసముల ద్వారా దేశకాల వాతావరణమున కనుకూలముగా బోధించ సమర్థుడు కావలయును. కృష్ణుడంటాడు 'తనగురుబోధను తాజదివిన విను వితతివింతె యీబోధ నేర్వకున్న వ్యర్థంబని జన్మ, శరణానెటంటూ వెంటనె వారు దరిజేరెతట్టూ" ఇట్లు ఘనమయిన యుక్తి చేసిన వానినే శిష్యుడని శిష్యలక్షణము వెలవిచ్చినారు. ఇంకా యీ శిష్యుడు గురు సన్నిధిలో నుండు విధమును గూర్చి చెప్పిన తీరు చూడుడు. "జలము నెడబాయ నొల్లని జలచరముల రీతి బూని' ఇంకా "సతి పొరుగూరికిపోయిన పతిరాకడ గోరినట్లు భావములోనన్ మతిమంతుడు సచ్ఛిష్యుడు సతతము గురు రాకను గోరును" ఎటువంటి వాడయిన గురువు, వరుడని భావించక అంగె తామసామిగారన్నట్లు "మానవుండై రాక గురు మమ్ముద్ధరించునచే" శిష్యుని తపఃపుణ్య విశేషమున మానవాకారమున అవతరించిన మహోదయుని. సద్భావన చేయవలయును. పరశరామ నృసింహదాసుగారు చెప్పినట్లు గురుడు (దేవుడు) "నిత్య నిరాకార నిరుపద్రవాఖండ నిర్మల నిర్గుణ నిష్కళంక నిష్కర్మ నిష్క్రియ నిస్సంగ నిర్ద్వంద్వ నిరుపమ నిరింద్రి నిర్వికల్ప నిష్ప్రపంచావ్యయ నిశ్చల నిశ్శబ్ద నిర్వచనానంద నిర్వికార నిర్విశేషాచింత్య నిరతిశయానంద సస్వరూపంబు నిస్సంశయముగ వారి జానన కైలావనాన. వాన వాడు కైన వర్ణింప నలవికాని వానినిగా సద్భావనచేసి అతని అఖండాచిల కరుణాకటాక్షామృతము నడయ వేడుచున్నాము.

# జండా వందన గీతము

1) జండాను పైకెత్తుమన్నా । అచల
జండాక్రిందా నిలిచిదండ మిడుమన్నా ॥ జం॥

2) అన్ని వేల్పులకన్నా మిన్నా । దీని
కన్న వేరొండు లేదన్నా మాయన్నా ॥ జం॥

3) వేదాంత సారమోయన్నా । మాయ
వాదరహితంబైన బోధగనుమన్నా ॥ జం॥

4) మోక్షమే బట్టబయులన్నా । అందు
సాక్షితత్వము లేని సంజ్ఞనే సున్నా ॥ జం॥

5) బ్రహ్మ విష్ణు మహేశులన్నా । పర
బ్రహ్మ తత్వంబిదే బయలు గనిరన్నా ॥ జం॥

6) శివరామ దీక్షితుల జండా । ఇదీ
భవనాశ స్థితిలేని పరిపూర్ణ జండా ॥ జం॥

## గద్య

ఇతి శ్రీ శివరామ దీక్షితాచల గురు పీఠ సాంప్రదాయకుల శ్రీ పూర్ణానంద వాడపల్లి అగయారుగల ప్రియశిష్యరత్న శ్రీశ్రీశ్రీ మాతృశ్రీ తూడి దేవమాంబగారి ప్రియశిష్యరత్న శిరోభూషణులు శ్రీ నిర్మలానంద పిల్లలమర్రి భీమకవిచే విరచితమై ఏతత్పీఠ సాంప్రదాయకులు శ్రీశ్రీశ్రీ అరట్ల రామారావుగారిచే పరిష్కరింపబడిన ఈ నిర్మలానంద తత్వ తరంగిణిలో పూజావిధానం పద్య భాగము పాటలు వచనము తదితర సమాప్తం
ఓం తత్ సత్
ఓం శాంతిః శాంతిః శాంతిః

జైగురు

## మంగళహారతి

1) హారతివ్వరె భక్తానందా దేవమాంబ
స్వామి సద్గురు మాతకూ ॥
వేమూక తోడూత సూరిభూషణులంత
సారె సారెకు మంగాళారాతి నివ్వారె.
అంగుగను పరిపూర్ణ బోధను పొంగుచును
భక్తులకు తెల్పెటి లింగలింగారహిత
అర్యా భద్రమగు మా జనని కిప్పుడు

2) కష్టామనక విూరు అష్టా మదంబులూ
నష్ట పరచియు నిల్పియూ
నిష్టతో వండియు నియమూలన్నియు గల్గి
సృష్టికి మొదలయిన శ్రేష్ఠ సద్గురు కిపుడు
బాగును భక్తులకు కర్మల బారద్రోలియు పరము దెల్పి ప్రత్యక్షముగ జూపించి యెరుకను
శిక్ష జేసిన సాక్షిమాతకు ॥హార॥

3) హారిముత్యంబులూ పేరూలచే మల్లెపూలా హారము వేసియు కరుణాచే ముంజేతి కంకణంబులు గట్టి కనులా విందుగ జూచియు
ముందు ముందు ద్వాదశిని నా
డెందమందున జూపి మదికిని
తొందరొందగ వలదటుంచును
సంధియుంబులు బాపె గుర్విణి ॥హార॥

4) గంధమక్షంతాలు పసుపూ కుంకుమ పెట్టి బుక్కాగులాల్ జల్లరె
హస్తారు పన్నీరు అగరు బత్తులు వేగ
సొగసూగ వెలిగించరే వరువడీ బంగారు పళెము
బాగుగను మనిచేత తీసుక
తేపతేపకు సోహమనె కర్పూర్
హారతి మహితవల్లికి ॥హార॥

5) మూలాములేని యూ నాల్గవ తనువాని
చాలాగ బోధించియూ
కలలోన గన్పట్టి కడు చిత్రిమేనాని
కాంక్షాలన్నియు తీర్పియూ
వాసికెక్కినట్టి పాలంపేట యందు
నివాసమైన పిల్లలమఱ్ఱి భీమయాఖ్యుని
ప్రేమ హారతి గొనుము తల్లీ ॥హార॥